# పీఠిక.

లోకమున స్త్రీలకు ధనమెక్కుడా రూపమెక్కుడాయను నంశమునుగూర్చి మన్మథకుబేరులకు వివాదముసంభవించి యింద్రునానతి ద్రాక్షారామపురంబున కేతెంచి యచట "రాగమంజరి" యనునొక వారనారీమణిని వశపఱచుకొనుటకై వారిరువురును మారురూపంబులను ధరియించి వచ్చుటయు, తొలుత మన్మథుండామెను వశపఱచుకొనంగాఁ గుబేరుండామెను తనధనమహిమచేఁ ద్రిప్పి దిగ్విజయంబు నొందుటయు గలకథ నూతనకవి సూరనయనుకవివరునిచే మూడాశ్వాసముల ప్రబంధముగ వ్రాయఁబడియున్నది. నే నాగ్రంథము నాధారముచేసికొని మఱి కొంతకథను కల్పించియుఁ గొన్నియెడలఁ బాత్రముల పేరులు మార్చియు నైదంకముల నాటకముగా రచియించినాఁడను. ఈనాటకము ప్రస్తావనలో వసంతఋతు వర్ణనగల సీసపద్యమును, మన్మథకుబేరుల కలహభాగమున పదిపద్యములును నే నాప్రబంధంబు నుండియే కైకొంటిని. ఈనాటకము వ్రాయుటలో సాధ్యమైనంత వఱకు బాత్రగుణ పోషణంబును, రసపోషణంబును బరికించియే వ్రాసియుంటిని. కాని గ్రంథములు వ్రాయుటయందు నాకిదియె ప్రథమప్రయత్నమగుటచే లోపములే యుండి యుండవచ్చును. ఇందేవేని లోపములు తమకుఁ బొడసూపినయెడల రసజ్ఞులగు పండితులు దయాపూర్వకముగ నాకెఱింగించిన చో, వానిని వందనపూర్వకముగ ముందుకూర్పునందు సవరించుకొనుచున్నాఁడను.

15—7—06,
తణుకు.

ఇట్లు:
బాలాంత్రపు - వెంకట్రావు.

## ఇందువచ్చుపాత్రములు

| పురుషులు. | స్త్రీలు. |
| --- | --- |
| ఇంద్రుడు=అ. 1. 5 లో. | రతి = మన్మథునిభార్య. అ. 2. లో. |
| బృహస్పతి=అ. 1. లో. | రాగమంజరి = అం. 3. 4. 5. లో ద్రాక్షా రామలో నుండుభోగ స్త్రీకథానాయిక. |
| కుబేరుడు=అ. 1. లో. | చతురిక = రాగమంజరి చెలికత్తె అ. 3. 4. లో. |
| మన్మథుడు=అ. 1. 2 లో. | కుటిలాలక = రాగమంజరి తల్లి అ. 4. 5. లో. |
| నారదుడు=అ. 1. లో. | కనకలత = అ. 4. లో. మనోరమ యను భోగస్త్రీ చెలికత్తె. |
| చారుడు =అ. 1. లో. | సుమతి = రతిచెలికత్తె. |
| కామపాలుడు=అ. 3. మనోహరుని సేవకుడు. | రంభాదులు = అం. 1. లో. దేవతా నాట్య స్త్రీలు. |
| మనోహరుడు=అ. 3. 5 లో. రాగమంజరికై మారురూపువరుచుకొన్న మన్మథుడు. | సుమతి = అం. 2. లో. రతిదేవి చెలికత్తె. |
| సంకల్పసిద్ధుడు=అ. 4. 5 లో. రాగమంజరికై దక్షపురికి మారువేసముతో వచ్చినకుబేరుడు. | |
| భీమేశ్వరుడు=అ. 5. లో. ద్రాక్షా రామలోనున్న ఈశ్వరుడు. | |

ఇంకను సందర్భానుసారముగ సేవకుడు మొదలగువారు వచ్చుచుందురు.

శ్రీరస్తు.

# ధనాభిరామము.

## నాంది

ఆనతుఁడౌచు మోహుఁడనయంబు నిజాజ్ఞను దీర్చుచుండ మా
యానటిఁగూడి విష్టపమహాత్తరరంగము నందజస్రమున్
బ్రాణులఁగూర్చి పాత్రములయట్లనటింపఁగ జేయు నా జగ
న్నానిత సూత్రధారి కరుణామతి మిమ్ములఁ బ్రోచుగావుతన్.

సిరియును రూపసంపదలుఁ జిత్తమురంజనసేయ నొక్క మా
దిరిబని సేయఁగల్గినవర [illegible] మహిమంబు లక్ష్మికె
వ్వరిమహాదాశయంబునను వచ్చెనొ యట్టిమహానుభావుఁడా
హరిశరణార్థి [illegible] పార్శ్వశమున్ మిముఁ బ్రోచుఁగావుతన్.

సూత్ర—([illegible] పుష్పాంజలిం జల్లి) సకలవేద వేదాంగపారంగతులును, తర్క వ్యాకరణ మీమాంసాది శాస్త్రచర్చాచణులును, కావ్యనాటకాలంకారవేత్తలును, నిరుపమాన కవితాధురంధరు లనఁగు నీవిద్వన్మహాజనుల యనుజ్ఞ నేఁడొక నాటకరాజముం బ్రదర్శింపఁ దలఁచుచున్నగదా! (ఆకసమువంకఁ జెవియొగ్గి) సభాస్తారుల యనుజ్ఞ యేమని?

గీ. " నూతనంబును సమధిక నీతిబోధ
కమును లోకానుభవమగు కథనొకండు
చతురమతి రమ్యగతిఁ బ్రదర్శన మొనర్చి
సంతసముఁగూర్పవలె సభ్యసంతతులకు "

అనియా మహాప్రసాదము అట్ల కావింతునుగాక. కాని యిట్టి [illegible]
లక్షణములుగల నాటకరాజ మెద్దియో యోజింపవలసియున్నది, ([illegible]

రవంకఁదిరిగి) నాసహచారిణి నటి యింకను రాకున్న దేమి?

(నటి ప్రవేశించుచున్నది)

నటి—ఆర్యపుత్రా! వందనము. (మొగమువంకఁజూచి) అదేమి యేదియో దీర్ఘాలోచనఁగలవారైనట్లు కనఁబడుచున్నారు?

సూత్ర—మ రేమియులేదు. సభవారి యాజ్ఞానుసారముగనే రూపకంబుఁ బ్రదర్శింతునాయని యాలోచించుచుంటిని,

నటి—సాధా! యీసభాసదుల యనుజ్ఞ నాకును వినవచ్చినది. వీరశేష శ్రేముషీవిభూషణులుసుఁడీ! (సభవంకఁజూచి) ఆహా!

అఖిలనేత బ్రహ్మవిద్యాధనులును శౌర్య
ధనులుధనులును నయభక్తిధనులుగలిగి
రమ్యగతినున్న యీసభారంగమిపుడు
రాజిలుచునుండెను ధనాభిరామముగుచు.

సూత్ర—(సంతోషముతో) ప్రేయసీ! బాగుగ [illegible]తివి, మనసామాజికులచే నిదివఱకే పఠింపఁబడిన ధనాభిరామమను నాటకరాజము తల్లక్షణాభిరామమై యొప్పుచున్నదిగదా! దానినే ప్రదర్శించి యీసభవారి నానందింపఁజేయుదము.

నటి—సాధా! మఱచితి నానాటకమును రచియించినవారెవ్వరు?

సూత్ర—ఎవరా!

ఉ. మంత్రికులావతంసుఁడును మాన్యుఁడు సద్గుణగణ్యమూర్తి బా
లాంత్రమహాన్వయాంబుధి కళానిధియైతగు నారసింహస
న్మంత్రికి సూరమాంబకును నాలవపుత్రకుఁడై కవిత్వపుం
దంత్రములోలి నేర్చిన గుణజ్ఞుఁడు వేంకటరాయఁడు గ్మలీ!

నటి—ఓహో! ఇతఁడా! నాటకములు రచియించుటలో నీతనికిదియే ప్రథమప్రయత్నముగదా! మనకీతని నామమంతగా జ్ఞప్తియుండక పోవుటకీనాటకము నిదివఱకుఁ బ్రయోగింపకుండుటయే కారణము.

సూత్ర—ఔను ఇప్పుడా ధనాభిరామమును బ్రయోగింపవలయును. సభవారను కాలహరణంబున కోర్వరుకదా! కావున మనోహారంబుగనే దేనియొక్క ఋతువుంగూర్చి ముందుగ గానము సేయుము.

నటి—ఏఋతువునుగూర్చి ?

సూత్ర—ఏఋతువననేల! ఋతురాజమనఁబడు నివ్వసంతముంగూర్చియే గానము సేయుము.

నటి—సీ. వివిధగంధానూన నవమంజులోత్పల కుసుమసౌరభములు గ్రోలిగ్రోలి
కలితసౌరభగంధ కాసారమధ్యసుస్థిర వీచికాతతిఁ దేలితేలి
కమనీయపరిమళ ఘనసారరసముల సోనలనందందు సోలిసోలి
విలసితోజ్జ్వలిత కోమలచారు సహకారపల్లవంబులమీద వ్రాలివ్రాలి
గీ. విటవిటీసంఘములమీద వేఁటకాఁడు
రతిమనోనాధు సంగడీఁడితఁడనంగ
కలహంసారవన వాటికలనమర్చె
నద్భుతానందరీతిఁ జైత్రాగమంబు

మఱియు, నీచైత్రావసరంబున

ఉ అన్నులమానపుతూపులని జాంగ బలంబును జేర్చి పేర్చియ
భ్యున్నతిఁ జైత్రయాత్రఁ గదియనుద్ధతిఁ జేయుచు తామసక్రియన్
గ్రొన్ననవింటివాఁడు పరిగొన్న జవంబున వీఁక నెట్టి సం
పన్నులనైనగానిగరువమ్మునధిక్కృతి సేసిమించెడిన్

సూత్ర—ఇంతీ! ఇదియంతయును మాధవునిమహిమమేకదా! చూడు!

గీ వెలయునారామ వాటికాపీఠమునను
మాధవుఁడు గొల్వుగూర్చుండె మహితగతిని
భాసురాపూర్వరుచి సుధర్మాసనమున
లీలగూర్చున్న దేవేంద్రుబోలి చెలియ!

ఇదిప్రస్తావన

శ్రీరస్తు

# ధనాభిరామము

## ప్రథమాంకము

రంగము :—సభాభవనము

(విబుధవర్గముతో నింద్రుఁడు ప్రవేశించుచున్నాడు)

ఇంద్రు—ఆచార్యవర్యా!

క. లోకంబులు బహుదుష్టా
నీకంబులవలననిపుడు నెఱిచెడక సుసౌ
ఖ్యాకరములగుచు సమ్మది
గైకొని సంపత్ప్రభావ కలనఁ [illegible]గునే

బృహ—దేవేంద్రసార్వభౌమా! శత్రుశిక్[illegible]క్షణంబును గావించు బిడౌజునంతటివాఁడు కులిశధరుండై మూర్ధాసనము నధిష్టించి యుండ, లోకంబులు నిరాకులస్థితిఁ జెందకయుండునే?

ఇంద్రు—సమస్తలోకంబులవారును దమ[illegible]ధర్మంబులందప్పక ప్రసన్న భావంబుల వర్తింపుచుండిరికదా!

బృహ—దేవర సెలవిచ్చినట్లు ముల్లోకంబులవారును దమతమ నియమిత కృత్యంబుల నప్రమత్తులయి ప్రసన్న భావంబుల మెలంగుచుండిరనికదా-నిన్న మనము చారులవలన వినియుంటిమి.

ఇంద్రు—ఆఁ! బాగుగ జ్ఞప్తికిఁదెచ్చితిరి! లోకంబుల వార్తలం దెలిసికొని వచ్చుటకు సువిచారులగు చారులం బంపియుంటిమికదా! వారింకను రారైరి. కారణం బేమైయుండునో?

బృహ—(చప్పుడువిని) అదిగో! ఎవరో వచ్చుచున్నట్టులున్నది?

(సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ—బృందారక బృందసంస్తవనీయ ప్రభావా! దేవేంద్రసార్వభౌమా! నమస్కారము. గురువర్యా! నమస్కారము.

బృహ—విజయోస్తు.

ఇంద్రు—సేవకా! ఏమికార్యము?

సేవ—దేవా! రంభాద్యప్సరోగణంబులు దేవరవారి యనుజ్ఞకై ద్వారంబు కడన వేచియున్నవారు.

ఇంద్రు—అటులైన వారినిటుగొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి మరల రంభాదులతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

రంభాదులు—(నమస్కరింపుచున్నారు.)

ఇంద్రు—విటజనాకర్షణోపాయ వైశద్యారంభవగు నోరంభా! నీగానామృతవృష్టింగురిసి నావీనుల నొక్కసారి విందుసేయుము!

రంభ—ద్విపద. కరము చక్కఁదనమ్ముఁగలవారమనుచు
సిరులు గల్గునట్లంచుఁ జెలరేఁగిమనుజు
లోకరి నొక్కరుచాల నుల్లసమాడి
వెకలులై యొండొరుల్ విముఖులయ్యెదరు
కాని యాలోచింపఁగా నల్ల రెంటి
లో నేదిమనుజుల లోఁగొను నెడల
బలవత్తరంబుగాఁ బనిసేయఁగలదో
తెలియలేకున్నారు తిన్నఁగా నెక్కుడు॥

ఇంద్రు—ఆహా! ఏమీ! అతి గభీరభావంబునం బొదలుచున్న నీగీతచాతురీ మహిమంబు హృదయంబు నాకర్షింపుచున్న దే? (బృహస్పతివంకఁ దిరిగి) గురువర్యా! లోకంబున రూపమెక్కుడో, గాక ధనమెక్కుడో తెల్పి యిపుడు నాకుంగలిగిన యీసంశయంబు నివారింపుఁడు?

బృహ—దేవేంద్రా! ఇయ్యది సూక్ష్మదృష్టింజూచి చెప్పఁదగినదే కాని సాధారణాంశంబు కాదు. (అని యోచించుచున్నాఁడు)

ఇంద్రు—రంభాద్యప్సరోగణంబులారా! మీమీమనంబులంగల యభిప్రాయంబులం జెప్పి యీ నాసంశయంబు నివారింపుడు? ప్రాయికంబుగ లోకంబుచే నెక్కుడుగఁ జూడఁబడునది రూపమా? ధనమా?

రంభాదులు—(ఆలోచించుచు నిటునటు చూచుచున్నారు)

ఇంద్రు—ఏమిది? నేనడిగిన ప్రశ్నంబున కొక్కరును సదుత్తరంబీయక యిటునటు చూచుచున్నారు? (పైవంకఁజూచి) ఆఁ. వీనికధి దేవతలగు మన్మథ కుబేరు లీదిక్కునకే వచ్చుచున్నారు. వారివలనఁ దెలిసికొందును గాక.

(మన్మథ కుబేరులు ప్రవేశించుచున్నారు)

మన్మ—తరుణులకు భోగేచ్ఛపుట్టించునది రూపముగాని ధనమా?

కుబే—తరుణులకు భోగేచ్ఛపుట్టించునది ధనముగాని రూపమా?

ఇంద్రు—(ఆశ్చర్యముతో) ఇదియేమి? వీరి[illegible]రు సెందులకో కలహించినట్లగపడుచున్నది? ఆయాసనములం గూర్చుండుఁడు.

(మదన కుబేరులట్లు చేయుచున్నారు.)

కుబే—దేవా! ధనమెక్కుడా? రూపమెక్కుడా? యను సంశయంబునుఁగూర్చిన సంశయంబున మాయిరువురకును వాదంబు ప్రాపించినది.

ఇంద్రు—(ఆశ్చర్యముతో) ఏమేమీ! మీకును నీసంగతికేనా సంశయంబు పాడమట? మేలు! మేలు!

మన్మ—దేవరవారికిని నిట్టి సంశయంబేనా? కలిగినది?

ఇంద్రు—దానింగూర్చియే నేనిప్పుడీ రంభాదులనుఁ బ్రశ్నించియున్నాను.

బృహ—ఇది యాలోచనీయంబైన యంశంబుగాని వట్టిమాటలవలనఁ దేలునది కాదు.

మన్మ—(తనలో) ఈరంభాదులు తప్పక రూపమెక్కుడనియే చెప్పుదురు;

స్త్రీలకు రూపముగలవానింజూచినఁ బ్రియము మెండుకదా!

కుబే—(తనలో) వేశ్యలు విత్తాసక్తులుకావున వీరిప్పుడు ధనమెక్కుడనియే చెప్పుదురు.

ఇంద్రు—గురువర్యా! నామనంబున నీసంశయంబుతోఁచుటయు వీరిరువురు దీనిఁగూర్చియే వివాదముపడుచు నిచ్చటి కరుదెంచుటయుఁ జూడ నాకు మిపుల నాశ్చర్యకరముగా నున్నది.

బృహ—బుధులమనంబు లెట్లుండునో కార్యంబులు నట్లయగును. మీవంటి బుద్ధిశాలురకుఁ దోఁచినది గట్టిసంశయంబుకాని వట్టి సంశయంబగునా?

మన్మ—(తనలో) ఏమిచెప్పిన నెవ్వరేమనెదరో యను భయముచేత నొకరినొకరుచూచుకొను నీరంభాదులేమిచెప్పఁగలరు? చెప్పిన నేన చెప్పవలయును. మెప్పువడసిన నేన మెప్పువడయవలయును. (అని ముందునకు జరుగుచున్నాఁడు)

కుబే—(తనలో) ఏమీ! వీఁడు ముందుముందునకు జరుగుచున్నాఁడు? కానీ వీఁడేమిచెప్పునో చూతము.

ఇంద్రు—రమాకుమారా! చెప్పఁదలఁచినదేదియో చెప్పుము సంశయించెదవేల?

మన్మ—సంశయ మేలందును? వినుము.

ఉ. మానితరూపయౌవన సమగ్రతచేఁ దుదముట్టి పైకళా
స్థానము లంగభేదములు జాతులు సర్వమెఱింగి కామవి
ద్యానిపుణుండునై మెలఁగు నాతనిఁగూడి చెలంగునట్టియా
మానిని యొండెఱింగి పయిమైకొను నే ధనమెంతయిచ్చినన్॥

మఱియు సతులను మచ్చికచేయుట యెఱుంగక మూఢమతులై గాఢరతులఁ దమకోర్కెలఁ దీర్చుకొనఁజూచు ధనవంతులను యుక్తాయుక్త విచక్షణులగు రూపవంతులఁ బైకొనినఁ గాంతలు మనంబుననైనను దలంతురా! వలపుగలవిటుని కౌఁగిట మహానంద పదవినున్న కాంతకు ధనమెంతచూపినను నేమిప్రయోజనము? రూపవిశేషంబులు, యౌవనచ

యంబుల మోహాతిశయంబులక విహారస్థానంబులుకదా!

ఇంద్రు—అయిన?

మన్మ—అయినచో రూపమెక్కుడుగాక ధనమెట్లు లెక్కుడగును?

కుబే—ఓరోరి మదనా! దుర్ణయవిహారసదనా! ఏమిరా నీప్రగల్భంబులు? బృహస్పత్యాది విజ్ఞాననిధులెల్లరును వినుచుండ నేటికి నోటికొలందినిఁ బ్రేలెదవు? వారు నవ్వెదరనియైన సిగ్గులేదేమి? "తన్నుఁదాఁబొగడికొనినఁ దన్ను కొన్నట్లేయుండు" ననునట్లుగా నిన్ను నీవ పొగడుకొనుచున్నావు? బళీ! భామినులకు ద్రవ్యమునందుఁ బ్రేమాతిశయంబుగానిరూపమేమిటికి? నీమూలమున నాసంగతిఁ జెప్పుకొనవలసినవాఁడనైతి. గాని యిది యాత్మస్తుతిగాదుసుమా! ఈదేవేంద్రుండు మధ్యనేమియు మాటాడక యూఁకొనుచుండెననియా హద్దులేక వదరుచుంటివి? ధనమాహాత్మ్యము నీకేమి తెలియును?

సీ. కడువికృతాంగుఁ జక్కనివానిఁగాఁ జేయుఁ బాపకర్ముని బుణ్యపరుని జేయుఁ
గులహీనునైన మిక్కిలి గులీనుగఁ జేయు వెనువెఱ్ఱివాని వివేకిఁ జేయు
నరయదురాచారు సాచారునిగఁ జేయుఁ బరికింప జడమతి సరసుఁ జేయు
నీచవర్తనుని సన్నుతిమంతునిఁ జేయు బెరకువానిని ధైర్యపరుని జేయు
గీ. భేలనలభీముఁడను పేరఁ బిలువఁ జేయు
రసికతయొయింతలేని నిరక్షరికుఁ
బావనంబైన సకలవిద్యావిశాలుఁ
డనఁగఁ జేయును ధనము తథ్యంబుమూఢ!

కుబే—మిపుల కళాప్రావీణ్యుండై రూపవంతుండైన పురుషుండు దరిద్రుండైనచో నాతని భామినులు చేరనీయరు. ధనములేనివాఁడును జచ్చినవాఁడు నొక్కటియేకదా! అదియునుంగాక

చ. సరసతలేనివాని నతిజాడ్యుని రూపములేనివాని ము
ష్కరుని వివర్ణునిం దనువు చాలఁగ[illegible]వానిఁ బ్రామిడిక

వెఱవిడివానినైన మటివింతలు సేయఁగఁ బిల్లఁగంగనల్
కరమరుదైనవస్త్రములుఁ గాంచనముల్ దగనిచ్చిపంచినన్
గీ. రూపుగలవారు విద్యలరూఢిమించి
నట్టివారును గులజులు నధమవృత్తి
ధనముగలవారి వాకిండ్లదైన్యముడిగి
కొలిచియుండుట యెఱుఁగవా కుసుమబాణ।

మన్మ—(కన్ను లెఱ్ఱజేసి) ఓరీ! పౌలస్త్యా! నేనష్టదిక్పాలురలో నొక్కండనని మిన్ను మన్నుఁగానక యీసమాసాంత్రికుండు వినుచుండ జనసమ్మతము గాని మాటల నేటికి నోటికివచ్చినట్లు ప్రేలెదవు? నీమాటలు నీకుబా గుండినఁ జాలునుకాఁబోలును. ఔనౌను. తనపెట్టియుఁ దాతపెద్దతనమును లేదుగదా! రూపయౌవనవిలాసముల నొప్పుకామినులు తమయాత్మసుఖమునకై రూపవంతుండగు నాతనిఁబొందున కియ్యకొందురు కాని ధనమెంతయిచ్చిన వికృతాంగునిఁ జేకొననేర్తురే? చాలుఁజాలునిఁక నీవాచాలంబులం గట్టిపెట్టుము నాముందరనా నీప్రతాపములు?

క. కరమగు యెల్లబాయంబున
సరసత్వము, నేర్పు, రూపు, సంపదయును, సు
స్థిర మృదుభాషలుగల స
త్పురుషులుగల్గిన ధనంబుఁ బోలతితలఁచునే॥

కుబే—ఓరీమూర్ఖుఁడా! "ధనమూల మిదంజగత్తు" నియెడి యార్యోక్తి వినవా యేమి? మదించిన యాఁబోతువలెఁ గనులుమూసుకొని యేల మీఁదిమీఁదికి వచ్చెదవు?

మన్మ—ఏమీ మీఁదిమీఁదికి ననుచుంటివి? నీవనినట్టిధనమ్ము రూపమునిచ్చునా? రూపంబునఁ గాంతామణులు వలచుటయు, లోకవశ్యతయుఁ జేకూఱును. రూపహీనులెట్టివారును జేరరోయుదురు. చేతఁగాని మాటల నేలయాడెదవు?

మంచే—ఔరా! నావిచేత గాని మాటలును నీవిచేతనైనమాటలునా? రూపము చేతఁ గాంతలువలతురేమి? మాటల నొకటఁదేర్చుచు మన సొకటనుంచి తిరుగులాడు పూఁబోడుల వర్తనంబులును వారివలపులును మదోన్మత్తుండవగు నీవేమియెఱుంగుదువు? అది తెలియనివానికిఁక ధన మహిమమే మి తెలియును? చూడుము.

చ. మదనుని గాఁదలంతు రిలమానిను లెల్లరు సత్కవీశ్వరుల్
ఘదపడి కర్ణుఁడీతఁడని ప్రస్తుతి సేయుదు రెల్లవేళలన్
మదవదరాతివర్గములు మానుగఁగవ్వడియంద్రు భూప్రజల్
మది నరనాథుఁడందురు సమస్తము ద్రవ్యముఖంబుచూచినన్

క. చుట్టములు గానివారలు
చుట్టాలము నీకనుచు సొంపుదలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబుచాల గలరేబంధుల్

మన్మ—ఏమేమి? నీబట్టు పొగడికలు? ధనమహిమంబు నే నెఱుంగనిదియా?

సీ. ప్రాణమిత్రునినైనఁ బగవానిగాఁ జేయు నతిమిత్రు ప్రాణముమీఁద నలుగఁజేయు
కొలఁగాని యతిలోభగుణముపుట్టఁగఁ జేయుఁ దోడఁబుట్టినవానిఁదొలగ జేయు
నరయపాపంబుల కాలయంబుగఁ జేయు సత్యమార్గంబులఁ జప్పచేయు
వివరింప గురుజన ద్వేషంబు గాఁజేయుఁ జెట్టగుణంబులు పుట్టఁజేయు.

గీ. వసుమతీచక్రమున నెంతవారికైనఁ
దవిలిధనకాంక్ష యన్ని విధంబులకునుఁ
దెచ్చునదిగాన నిన్నియుఁదెలియవినుము
ధనము పాపస్వరూపంబు తథ్యమరయ.

చ. జలదము గాడ్పుచందమునఁ జంద్రిక బాలమెఱుంగు వీచికల్
తలఁప ననిత్యవస్తువులు ధారుణిలోపల నంతకంటెఁ జం
చలములు సంపదల్ తలఁపఁజాల ధనంబు నిజంబుగా మదిన్

వెలఁగినుతింప నేల సురసిద్ధ సమూహము చూచినప్పఁగన్.

శుచే—ఓరీమదనా! నీరూపము మాత్రము శాశ్వతమా? ఒక్కసారి రోగమనె
డి భూతంబావేశించి రక్తమాంసములు హరించినచో నిఁకఁ జచ్చినఁగాని
యామొదటిరూపంబు వచ్చునా! ఇప్పుడు నీవనెడి చంచలము నిన్ను
మాత్రము వేధించదాయేమి? కాని నాయక్షణంబగు నిధానంబులు న
న్ను మాత్ర మెన్నఁడును విడిచి పోవు.

మన్మ—నానిధానములకును నాకును జననములేదని నాటువచించినంతె మాత్ర
మున నేమి? గోతిదరి నక్కచందంబునఁ గాచికాచి తుదకెవ్వరిపాలో
సేయసిద్ధముగ నుంటివని నీకుమాత్రము తెలియదాయేమి? కన్నుమూసి
తెఱచునంతలోఁ జేయివీడి మాయమై పోవు నీధనంబు నేలపట్టుకొని
పాకులాడెదవు?

శుబే—క్రిందుమీఁదుఁగానక మాటలఁ గ్రోపిడేయుచుంటివిగా? నన్నెవ్వరను
కొంటివోయి? తన కంటిమంటలచే నీమెయిఁబూది గావించిన త్రిపు
రాంతకుని నెచ్చెలికాఁడనుసుమా!

మన్మ—ఆఁ. అతనినెచ్చెలివేయైనచో నాడేలనిరడ మఱింతబూదెఁ బూసుకొ
న్న బాగుండునుగాని యెగిరిపడిన నేమిప్రయోజనము? చేతనైనచో
నాతనివలెనే నీవును జోలికట్టుకొని తిరిపమెత్తుట యందు నేర్పరివి కమ్ము.
ఎఱుఁగవాయేమి? నీనెచ్చెలికాని బంటుతనము? నావాడితూపులకోడి
యేకాదా విల్లునమ్ములు నేలఁ బడవైచి బెదరిబెదరి చూచుచు సిగ్గించుక
యులేక, ఆడదియనియైన నెంచక భార్య శరణుజొచ్చి యామె మ
ఱుంగున డాగినవాఁడు. సిగ్గులేక యింతటివీరునిఁ జెలికాఁడని గూడఁ
జెప్పుకొనుచుంటివిగా! ఇవియా నీబెదరింపులు? తాటాకుచప్పుళ్లకుఁ
గుందేళ్లు బెదరునా?

గుబే—ఊఁ సగముచచ్చినవాని నేలచంపవలయును? తవుడుదిని చచ్చెడివానికి
విషమేల పెట్టవలయును? ఓరీ! అతనుఁడా! భూతముమాడ్కి సంచరిం

చుచు నాహారుని దయాధర్మభిక్షంబున నీపాటిగనుండి మొండికెత్తినో టికొలంది ప్రేలిన నిన్నుఁ గాదనువారెవ్వరు? ఇచ్చో భూతమంత్రంబు సే కరవుపెట్టిన నీయాటోపంబు నేలంటు.

మన్మ—ఓరీకుబేరా! నీవెవ్వఁడవు? భూతపతికిఁ జెలికాఁడవుకావా? నీభూతమంత్రంబు నీకే మోసము తెచ్చునని యెఱుఁగవుకాఁబోలును?

కుబే—ఛీ! దురాత్మా! నోరుమూయుము. ఊరకొన్న కొలందిని మీఁదిమీఁదికె వచ్చుచుంటివి. నీమిడిసిపాటు నీనాయాయుధమ్మున నొక్క సారిగా నేలంటునట్లు చేసెదను. (అని లేచుచున్నాఁడు)

మన్మ—(లేచి) నీవాయుధమెత్తినంతమాత్రమున నడలువారెవ్వరు? రారమ్ము నాదెబ్బచవి చూతువుగాని. ఇవిగో! నాయలరుటమ్ములువచ్చుచున్నవి. ఇఁక నీప్రాణంబులు నీవనుకొనకుము. ధీరుండవైతివేనిఁ వెనుఁజూపక నిలువుము,

(అస్త్రములు సంధించుచున్నాఁడు)

బృహ—కుబేరా. ఏలనీకీవెఱ్ఱి? మదనా! దుడుకులు చాలింపుము. ఇద్ది యాఖండలుని సభాస్థానంబుగాని యుద్ధరంగముకాదు. ఇంచుక తాళుఁడు!

కుబే—గురువర్యా! చూడుఁడు! వీని పోతరము? గురునాజ్ఞనతిక్రమింపరాదు

(తనయాసనమునఁ గూర్చునుచున్నాఁడు)

మన్మ—(ఆసనము మరల నధిష్ఠించుచున్నాఁడు)

ఇంద్రు—ఆచార్యవర్యా! ఇదియేమి? చిలికిచిలికి గాలివానయైనదే! వీరంతకంతకుఁ గోపోద్రేకంబునఁ బాకంబులు ముదరపెట్టుచున్నారు అయ్యో! నాకీసందియమేల పొడమవలయును? (యోచించి) నేనిప్పుడెవ్వరి నూరకొనమన్ననుఁ బక్షపాత శంకలోకంబున వాటిల్లు! ఏమిబుద్ధి?

బృహ—(పైవంకఁజూచి) అదిగో! కలహప్రియుఁడగు. నారదుఁడీవంక నే వచ్చుచున్నవాఁడు. వీరిని మఱింత పురికొల్పునుకాఁబోలును. ఆవ

దలఁచిన యమంగళములన్నియు నీవలనకే యైనవి. ఇఁక నేమిచేసిన నేమి ప్రయోజనము కానీచూతము.

(నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార—(తనలో) నాకీదినమునఁ జాలినంత భోజనము లభించినది. ఈమదనకు వేరులిరువురును మదించిన వృషభములవలెఁ గయ్యమునకుఁ గాలుద్రువ్వుచు నేమేమియో వాదించుచున్నారు. మఱింత పురికొల్పుదును గాక! (ప్రకాశముగా) బలసూదనా! ఏమీ యీకలకలము? ఏమీ కలకలము? వీరిరువురు నెందులకో కలహించినట్లగపడుచున్నారే. సుధర్మాసనాధిష్ఠాతవైన నీవే యిట్లుచూచుచు నూరకొన్న నిఁకఁ దీర్చువారెవ్వరు? వీరిట్లు కలహించుటకు కారణమేమి?

ఇంద్రు—(లేచి) ఇదె నమస్కరింపుచున్నాను. (ఒకపీఠమునుజూపి) ఇందాసీనులుకండు.

నార—(అట్లు కూర్చుండుచున్నాఁడు)

ఇంద్రు—(కూర్చుండి) మానీంద్రా! ధనరూపంబులంగూర్చి వీరిరువురున్నుగ్రావేశంబులఁ బోరాడుచున్నవారు. ఇందేరిలో నేమనుటకును దోఁచక యేనిట్లూరక వారిని వారింపనేరక చూచుచుంటిని. లోకంబున సామాన్యంబుగ నీరెంటియందెద్ది యాధిక్యదశం జెందియుండునో చెప్పివారివాదంబులు నిర్వివాదంబులుచేయఁ బ్రార్థించుచున్నాఁడను.

నార—(ఆలోచించి) బలసూదనా! వీరు క్రోధావేశంబున నెడలెఱుంగక యేమేమియో యొండొరులం దూషించుకొనుచున్నవారు. అట్టివారి నడుమకేగి మాబోంట్లు వారించుట కర్తవ్యంబుకాదు. వీరివాదంబులఁ గల యర్థంబు త్రిలోకాధినాథుండగు నాదక్షవాటి కాధీశుని ప్రోలఁదెల్లంబుకాఁగలదు.

ఇంద్రు—అట్లయిన నీయిరువురిని నాసర్వేశ్వరుని స్థానంబగు దక్షవాటి కనుపుదము.

నార—అయిన నేనిట్లు చెప్పెద. ఓధనరూపాధిపతులారా! ఏమీ యీవృథావాదంబులు? మీమీయాధిక్యంబుల నేర్పఱుప నాదక్షవాటికా నిలయుండగు నీశుండె కాని యితరులుశక్తియుక్తులు కానేరరు. కావున వేగమె యాపురంబునకుంబోయి సఫలీకృత మనోరథులై యీసురేంద్రుని మనంబునఁగల యారాటం బుడిగింపుఁడు.

మన్మ—మౌనీంద్రా! మాసంశయార్థంబచ్చట నెట్లు స్పష్టీకరింపఁబడునో తెల్పినయెడల నిప్పుడ యాతావునకుం బోవువారము. తొనఁట! పురహారుని నెచ్చెలికాఁడఁట! ధనమఁట! లోకమున హెచ్చఁట' ఏలయీ బెదరింపులు? వీనికి జడియువారెవ్వరు? నిమిషమిటునిల్చిన యీమన్మథ మోహమంత్ర ప్రభావమ్మున యక్షాధిపుండు తానేమికానున్నవాఁడో? మీదెఱుంగక మీదిమీదికి వచ్చుచున్నాఁడు

కుబే—ఔరా! నీసమ్మోహనమును, నీమంత్రమును, మేమెఱుంగనివికావు. నాఁడాహరుని కంటిమంటలు మిన్నుముట్టినప్పుడివన్నియు నేయేటిలో గలిసినవో? చాలుచాలు! నీప్రతాపంబులు. ధీరుండవైనచో దమ్ము దక్షవాటికా నిలయుండగు నాసర్వేశ్వరుని పాలికిఁబోవుదము. అచట మనయిర్వురకుఁగల తారతమ్యంబు తెల్లంబుగాక పోదు.

నార—కుబేరా! ఏలతొందరపడియెదవు? మదనా! కోపంబుడుగుము. మీ యిరువుర వాదింపుమని సురేంద్రుండు సెలవొసంగుచున్నాఁడు. సురాధినాథుండగువాని యాజ్ఞ నుల్లంఘింపక యించుక తాళి సువిచారులు కండు

(చారుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చారు—దేవేంద్రా! నమస్కారము.

ఇంద్రు—ఏమిరా! లోకంబున విశేషాంశంబు లెవ్వియైనఁ గలవేని శీఘ్రముగఁ జెప్పుము.

చారు—దేవా! తమయనుజ్ఞ శిరసావహించి మర్త్యలోకంబున సంచరింపుచు-

దక్షవాటికేగితిని.

ఇంద్రు—తరువాత ?

చారు—అందు జగద్రక్షకుండును, భక్తజనాభీష్ట ఫలప్రదాయకుండునునగు భీమనాథుని యాలయప్రాకార ఘటితశిలాంతస్థంబున నొక లేఖ్యంబుఁ గాంచి యది దేవరకు విన్నవింపవచ్చితిని.

ఇంద్రు—ఏమది ?

చారు—పఠించెద నాలింపుఁడు.

“లోకంబున ధనరూపంబులలో నెయ్యది యెక్కుడను సంశయంబున సంశయాపాదితచిత్తులై వాని నిశ్చితార్థంబు నారయఁగోరువారలు, మత్పురంబుఁజొచ్చి, మత్సేవఁజేయుచుఁ దమ ప్రజ్ఞాదివిశేషంబుల రాగమంజరియను నచ్చర ప్రోయాలు నేరు వశవర్తిం జేసికొందురో వారల కాయర్థంబు పొసంగి శ్రేయస్థానంబు నొందగలరు.”

అనియున్నది.

ఇంద్రు—మహేంద్రా! వింటిరా! నాసంశయంబునకును మీవచన నియతికిని జక్కఁగ నియ్యది తార్కాణయగుచున్నది.

నార—ఇఁక నీయిరువుర నటకేగుటకు సెలవొసంగుము. (తనలో) వీరు వీరి పట్టువీడకుండ నే నిట్లుపల్కెదను. (ప్రకాశముగ) మహాశయులారా!

చ. తరమిడి యున్నిమాటలు వృథాపనిలేదు, సమస్తవైభవో
త్కరమగు దక్షవాటిపురిఁగల్గు ధరాస్థలికేగియందుమీ
నిరుపమ రూపవిత్తముల నేర్పులుచూపి జయంబుఁగాంచియీ
సురపతి యారటంబుడుపఁ జూడుఁడు సారవిచారసంపదన్॥

ఇఁక మీరు మీగెల్పులయందు నిశ్చయమనస్కులై యుంటిరిగద ?

కుబే—నిశ్చయమనస్సననేల ? వినుఁడు.

మ. సకలామర్త్యుల మధ్య నేఁడిదె ప్రతిజ్ఞంబల్కెదన్, బుష్పసా
యకుతో నాడినయట్లగాక మఱియన్యంబయ్యె నేనిన్, నిధి

ప్రకరంబన్యులపాలుజేసి భయదారణ్య ప్రదేశంబులన్
బ్రకటస్థైర్యముతో మెలంగెదను యావజ్జీవపర్యంతమున్॥

మన్మ—చ. వినుఁడిదె మత్ప్రతిజ్ఞ సురబృందములార! కుబేరుతోడఁబ
ల్కినయటులేను దత్పురికిఁజని గెల్వఁగలేనయేని, బ
ల్వనములుబట్టి పోయి యనివార్యనిరంతర యానసంస్థితిన్
మనియెద జీవనప్రదరమార్గము నొందుచు నెల్లకాలమున్॥

ఇంద్రు—మేలు మేలు! మీయిర్వురిప్రతిజ్ఞయును జాల మెచ్చువచ్చినది. మీరు వేశ్యాజనమనోహరంబగు నాదత్తువాటికేగి మీమీప్రతిభావిశేషంబులం గనపఱచి విజయోన్ముఖులైరండు. (చారునివంక దిరిగి) నీవు నీస్థానంబునకుంబొమ్ము. ఈయుత్సవంబును మేమును గనుఁగొందుము.

చారు—చిత్తము (నిష్క్రమించుచున్నాఁడు.)

మద—(తనలో) నేను మత్ప్రాణసఖియగు రతికీయర్థంబుఁ దెల్లంబుఁజేసి యామె యనుజ్ఞగైకొని దత్తువాటికేగి నారూపాధిక్యతచే నావేశ్యవాటింగల సుందరాంగుల నావశవర్తులంజేసికొని విహరింపుచుండెదను. అవ్వల నీవిత్తాధిపుం డేమిచేయఁగలఁడో చూతము.

కుబే—(తనలో) నేఁబోయి సిద్ధస్వరూపంబున నాభీమవాటినినాధనమాహాత్మ్యంబుఁజూపి వారి నావశవశ్యలుగఁ జేసికొందు. తరువాత నేమికానున్నదో యట్లగును.

(యిర్వురు నిష్క్రమించుచున్నారు.)

ఇంద్రు—సేవకా! ఈకర్పూరతాంబూలంబు నీయప్సరాంగనలకిమ్ము.

సేవ—చిత్తము (అని అట్లుచేయుచున్నాఁడు.)

ఇంద్రు—వేళచాలరైనది. మీరు మీనిలయంబులకుంబొండు. మేమును గొల్వుచాలింపుచున్నాము.

నార—(తనలో) నేటికి కడుపాఱ భుజింపగంటిని. రేపటిదినము చూచుకొందునుగాక. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీరస్తు.

# ధనాభిరామము.

## ద్వితీయాంకము.

రంగము :—రతిదేవిభవనము.

(రతి ప్రవేశించుచున్నది.)

రతి—నేఁడేమియోగాని నాకుడికన్నదరుచున్నది. కార్యార్థమై సురేంద్రునికడకరిగిన నామనోహరునకేదైన నిక్కట్టువాటిల్లి యుండదుగద? చీమచిటుకుమన నాసురేంద్రుండు నానాథుని బిలువనంపి తనకుఁగలకార్యముల కితని ప్రధానపురుషునిగాఁజేసి తానుమాత్రము మిగిలియుండును కార్యములనెవ్వి? నివురుగప్పిన నిప్పుకణంబులమాడ్కి గుప్తతేజులై శాంతస్వభావులై చరియించు మునీంద్రుల తపోవిఘ్నంబులుగద! ఎల్లప్పుడీమఘవుండిట్టి వ్యాకులంబుననే యాకులంబునొందుచుండు. ఇప్పుడెద్దియైన నట్టిపనికిఁ బోద్పడుమని నాపతి నాతండు వేఁడికొనియుండడుగద? పరోపకార పారీణుండగు నాహృదయేశ్వరుం డావేగన్నలవాని వేఁడకోలున కియ్యకొని యిప్పుడట్టి కృత్యంబున కెద్దానికైన నొడంబడియుండెనేమో? లేక మఱియేయపాయంబుననైనఁ జిక్కికొని యుండెనో? అయ్యో! నామనంబుచేయిపెట్టి కలఁచినట్లు మిగుల వ్యాకులంబునొందుచున్నది. ఇప్పుడు నావ్యాకులపాటుదీర్చి నాచిత్తంబు స్వస్థతఁజేయ నామనోనాయకుండిటకు విచ్చేయునో లేదో కదా? ఏమిబుద్ధి? నేనేమిచేయుదును? పరితాప వేదనాధీనమానసంబునఁ గాలు నాకిప్పుడొడలంతయుఁ జీమలు జెఱ్ఱులు ప్రాకినట్లు మిగుల చీకాకుగ

నున్నయది. నాకు నాప్రాణేశ్వరుని జూచునంతవరకునుగడియయొ
కయుగంబుగాఁ దోఁచుచున్నది. ఆహా నేనీదుర్భరంబగు మనోవై
కల్యంబుననింక నీకాలంబునెట్లు వేగింతు ? ఇంతకునునన్నెన్నఁడు నెడబా
సి పోవని నాహృదయేశ్వరుండీపట్టుననదయావిహీనుండై నన్నొంటరికత్తెం
జేసి పోవుట యేకారణము. (ఇంచుక యాలోచించి) కుసుమంబులకై
యరిగిన నానెచ్చెలి సుమతియైన నింకను రాకున్నదేమి ? (అని చెక్కి
ట చెయిజేర్చి తలవంచి యాలోచించుచున్నది.)

(పూలసజ్జతో సుమతి ప్రవేశించుచున్నది)

సుమ—ముందునకు దృష్టిసారించి ఏమీ నాసఖియిట్లున్నది! ఏను దన్ను వీడి వచ్చిన యింతలో నే ముఖకాంతి తఱిఁగి విన్నబోయి నిట్టూర్పుల వేదనాభరమ్ము జెల్పుచుఁ జెక్కిటఁ జెయిఁజేర్చి తలవాంచి వికలభావమ్మున నీప్రక్కఁగూరుచుని యున్నది. నేవినియున్న యంశంబీమెకేమైనఁ దెలిసెనాయేమి ? చేరి కనుగొందునుగాక ! (సమీపించి ప్రకాశముగా) ప్రియసఖి ! నేఁడు చెన్నుతఱిఁగిన మొగంబున విన్నదనంబు తాండవమాడుచుండ విషాదంబున నిట్లు కూరుచుండియుండుటకుఁ గారణంబేమి ? నేనిన్ను వీడి కుసుమంబులు కోసికొనివచ్చునంతలో విపరీతవాక్యంబెద్దియైన నీచెవింబడెనాయేమి ?

రతి—(మొగమించుక పైకెత్తి) ప్రాణసఖీ ! యిట్లుగూరుచుండుటకు. కారణమేమియో చెప్పలేనుగాని నాకు నాప్రాణేశ్వరుని వీడినదాదిగ నిప్పులంబోరలినట్లు నామనంబు పరితాప భరంబున మిగుల బొక్కుచున్నయది దానికిఁదోడు అశుభసూచకంబుగ నాకుడికన్ను కూడ నదరుచున్నది. నేఁడేమిమూడనున్నదో ? అదేమిపుట్టువయోగాని జన్మమెత్తినదాదిగ సుఖముగా నింతకుడిచి కూర్చుండుటకుఁగూడ సావకాశములేని యొనలేని యుద్యోగ మీయనపైఁబడినది. నిముస నిముసంబునకును సురేంద్రుండు రమ్మనెనని యాపాదువేగరులు మాయింటిచుట్టును దిరుగుచునే

యుండురు. ఛీ! సౌఖ్యములేని బ్రతుకది యేటిది?

సుమ—(తనలో) నాయెఱింగిన యంశంబునింక నీమెతో వాకొనక యూరకొనరాదు. నేనిదిచెప్పినచో నీమె యేమితెగువచేయునో? ఆఁ! భయములేదు. అంతపనిబుట్టునా? ఎట్లయిన నిట్లుపరితపించుచుండఁజూచుచు నూరకొనుటకంటె నావిన్న సమాచారంబుచెప్పిన కొంతపరితాపభరంబు నెడఁప్చిన ఫలంబు నాకుఁజేకూఱు. (ప్రకాశముగ) నెచ్చెలీ! నీమనోవ్యథకుఁ గారణంబు నాకిప్పుడు పొడకట్టుచున్నది. నేనద్దాని నిందఱిసేవకునివలనఁ గుసుమాపహరణంబునకై పూలతోఁటకేగినప్పుడు వినియున్నదాన. అదియిప్పుడు జ్ఞప్తికివచ్చినది.

రతి—సఖీ! విపరీతమేమియు లేదుగద? నాపతి యిప్పుడిక్కడకువచ్చునా! త్వరితంబుగ నీవినినదానిం జెప్పి నామనస్తాపోపశమనంబుచేసిన పుణ్యంబుఁగట్టుకొనుము.

సుమ—విపరీతమునకేమున్నది నీపతియు నింతకు మార్గమధ్యమున నుండియుండు. ఇఁకొక్కనిముసములో నీమనోహరుని ముఖతామరసంబును జూచియానందింపఁగలవు. కాని కార్యముమాత్రము వేఱుగనున్నది.

రతి—సుమతీ! నామనోనాయకుండు నాకడకు వచ్చుచున్నాఁడని చెప్పితివంతియచాలును. కాని కార్యము వేఱనుచుంటివి. అదినామనంబున బాధింపుచున్నది. అదేదియో శీఘ్రముగఁ దెల్పుము.

—నీపతి నీకడ సెలవుగైకొని యింద్రసభకేగినపిమ్మట నచ్చట ప్రసంగవశంబున లోకంబున ధనమెక్కుడా! రూపమెక్కుడా! యనునంశంబును గూర్చిన సంశయంబున నీనాథునకును, అలకాధిపునకును గలహంబు సంభవించెనఁట.

రతి—అయ్యో? నాపతి యెక్కడికేగిన నిట్టిదుడుకుచేతనే చేయుచుండును. ఎల్లప్పుడును నొకతీరున సాగివచ్చునా! తరువాత!

సుమ—తరువాత నగ్ని హోత్రునకు వాయుదేవుఁడు సహాయమైనట్లు వారికల

హంబును నారదుండు మఱింతవృద్ధిచేసినాఁడఁట.

రతి—ఎక్కడికేగిన నీతందనాల జడదారి యిట్టిపనులే యొనర్చుచుండును. కలహాభోజనుఁడుగదా! పోనీ యిట్లు వీరిరువురు కలహించుచుండ విజ్ఞానవిదులైన యాబృహస్పత్యాది పూరుషవరేణ్యులుగాని సురేంద్రుండుగాని వారివివాదంబునివారింప లేక పోయిరా? అయిన లోకంబుననంటుకొన్న చూచువారలేకాని యార్చు సత్పురుషులొక్కరును గానరారు. తరువాత నేమిజరిగినది.

సుమ—పిమ్మట నీయర్థంబు తేటపడుటకై యొకశాసనమూలంబున బి.డో జుండు భూలోకంబుననుండు ద్రాక్షారామపురంబునకు బోవనాజ్ఞాపించి యాయిరువురను మెల్లగ సాగనంపినాఁడఁట.

రతి—దక్షపురికేగిన నేమిప్రయోజనము?

సుమ—వేశ్యాజనమనోల్లాసకరంబగు నాపురంబుఁ బ్రవేశించిననట విత్తకాంతలకెల్ల నాయకమణియై రాగమంజరియను కాంత విహరింపుచుండునట. ఆకామినినేవరువశవర్తినిగా జేసికొనెదరో వారలుతమప్రతిజ్ఞనెరవేర్చుకొనిన ధన్యులగుదురఁట.

రతి—ఓహో! వీరలు ప్రతిజ్ఞలుకుండఁ బల్కిరికాఁబోలు! అట్లయిన నాపతి సన్నద్ధుండై యాదక్షవాటి కేగుననుము. ఇచ్చటి కేలవచ్చునని చెప్పెదవు?

సుమ—ఆతండిటువచ్చుచుండెననియే వినియుంటిని. కాన నట్లంటిని.

రతి—(ఆశ్చర్యవిషాదములతో) సఖీ! యింతవట్టును నిక్కమేనా! లేక యూరక కాలక్షేపమునకై యిట్లుచెప్పుచుంటివా?

సుమ—ఏమో! యిదినిక్కమో కాదో నేఁజెప్పఁజాల. నాకాసురేంద్రుని సేవకుండు చెప్పినాఁడనుట మాత్రము నిశ్చయముగఁ జెప్పఁగలను.

రతి—ఆహా! మదనా! యెట్టిదుడుకు నేతలకు నాటపట్టయితివి? దుడుకు నేతలేల? ఇదియంతయు నారాగమంజరి కొఱకుఁ దెచ్చిపెట్టుకొనిన బూ

టక పుఁగాట్లాట. అయ్యో! నేఁడు నీ కీయింద్రసభ కేగుట కేమి వచ్చె?
యేగిన నాయింద్రున కేల యిట్టిసంశయం బుదయింపవలెను! అట్లు సంశ
యంబు పుట్టిన నది యచ్చటనె వీడక నాదక్షవాటి కేగుట రూపముగా
మారినదా? ఎక్కడిదక్షపురి? ఏటిభీమేశ్వరుండు. అయ్యో! మాన
కేతనా! అది వైరిపురం బని యైనఁ దలంపక యేల ప్రతిజ్ఞ బూని పోవు
చుంటివి? కొండం దగరు తాకినట్లు విత్తపతి యైనకుబేరునితో నెట్లు
కలహించితివి? సమయ మైనచో ధనవంతునిపక్షంబున నెల్లరును చేరు
దురు. దరిద్రుని చుట్టా లైనను చేర రోయుదురు. నీతల్లి యైనసిరి యే ని
న్నొల్లక యాతనికొట్టంబులఁ గట్టుబడి యుండ నింక లోకంబున నీ
సాధకబాధకములకు సాయపడువా రెవ్వరు? ఏల నీ వీలీల జేల వై
ప్రతిజ్ఞ పల్కితివి? ధనదుండు సాధారణుండా? నీకుఁ బరమశత్రుం
డైనయాపురహరునిప్రాణమిత్రుండు. అట్టివానితో నీ వీ లేనిపోనివృథా
కలహంబు లేల తెచ్చిపెట్టుకొంటివి. ఇంతకును నదృష్టఫలం బెట్టు
లుండునో బుద్ధులు నట్లు పుట్టుచుండును. రాగమంజరి నూరక చే
కొన్న నే నే మందునో యని యూపన్నగడఁ బన్నితివా యేమి? అయి
యుండ నోపు. అన్నా! పూరుషులకు బుద్ధి పెడతల నుండును గదా!
మాట లోకలాగున చెప్పి చేత లోకతీరున సాగింతురు. మగవారిని
నమ్మరాదు. నీకు నిక్కముగ రాగమంజరియందే యనురాగ మున్నచో
నీవు తెచ్చిపెట్టుకొన్న నే నే మందును? ఎలుకను బట్ట కొండను త్రవ్వ
చుంటివి కదా!

సుమ—అమ్మా! ఏల నీలీల జాలి నొందెదవు? నీమనోహరుం డీయసందర్భ
ములనెల్లఁ దెలియకుండఁ బ్రతిజ్ఞ పల్కెనా యేమి? ఒక్క స్త్రీనిమిత్త
మై యిట్టిమిషలం గల్పించుకొని లోకంబునకుఁ గంటకంబుగఁ బ్రవ
[illegible]ంప నేరికి యిచ్చ యుండు. నీపతిమాత్ర మంత వెనుకముం దాలోచనలు
లేనివాఁడా[illegible]ము?

రతి—కామేచ్ఛ యెంతకు గాదు? మంచిచెడ్డల రెంటిని మట్టు బెట్టును. మానాభిమానంబులు ప్రుగ్గ జేయు. దూరవిచారంబు పాఱఁ దోలు. అయ్యో! దీనిప్రభావాతిశయంబు లెవ్వ రెఱుంగనివి కావు. రాగమంజరీసంగమేచ్ఛ నీలీలలు పన్ని యుండ నోపు. ఇట్లని యెవ్వరితోఁ జెప్పుకొందును. ఆడదానిబ్రతు కన్న లోకములో నెంతచులకనగా నున్నది? ఇట్టిమాటలు వినియు మొండితనం బూని నాప్రాణంబులు నాబొందిని వీడఁ జాల కున్నవి.

సుమ—చెలీ! లేనిపోనియాయాసము నేల తెచ్చిపెట్టుకొనెదవు? పురుషు లెట్లు ప్రవర్తించినను పతివ్రత లగుకాంతామణులు సహించి యూరకొనవలయునేగాని, గయ్యాళివలె వీథి కెక్కి పదుగు రాడుకొనుట కాస్పదంబుగఁ బ్రవర్తింపరాదు. అయిన నీయంశంబులు నీకన్న నా కెక్కుడు తెలియునా యేమి?

రతి—నీవు చెప్పినదంతయు నెటు లున్నను నామనంబున కెక్కుట లేదు.

సుమ—సఖీ! పో నిమ్ము. రాగమంజరియందే యాస యుండి యిట్లు చేసినవాఁ డనుకొన్న దీనివల్ల నాతనికిఁ గల్గుప్రయోజనం బేమి యున్నది?

రతి—లే కేమి? నా కీకారణంబుఁ జూపింపవచ్చును గదా! తరువాత దానిం దప్పించుకొనుటకు నేదియో కారణంబు దాని వెనువెంటనే యుండి యుండును.

సుమ—దూరాలోచనకలవా రిట్టికార్యంబులయం దెప్పుడును మిగులజాగరూకతతో నుండెదరు. బుద్ధిమంతురాల వగునీకు నేఁ జెప్పవలసిన దేమియు లేదు. సమస్తంబు నీకే తెలిసి యున్నది. పతి కనుకూల యై వాని మేలు కోరువనిత యిట్టియపార్థంబులు తెచ్చిపెట్టుకొని వ్యాకులత్వమున నెప్పుడును కృశియింపదు. కావున నామాట విని యిట్టి లేనిపోని యనుమానంబులం బెట్టుకొని కుందకుము.

రతి—చెలీ! నీవు చెప్పెడిమాట లెవ్వియును నామనంబున కెక్కుట లేదు. నామనం బిప్పు డించుక యస్వస్థతగా నున్నది. కాన నించుక సేపు నన్ను మాటాడించక నీపని నీవు చూచుకొనుము. నే నించుక కాల మీ శయ్యపై మేను సేర్చుదానను.

సుమ—నీయిష్టానుసారముగ నాపని నేను చూచుకొందును గాక. (అని నిష్క్రమించు చున్నది.)

రతి—(శయ్యపై మేను జేర్చి యిటు నటు దిరిగి లేచి కూర్చుండి) హా! మారా! నీ కర్ధాంగి నగు నాయెడ దయ దప్పి నా కీదీర్ఘవిచారము నేల తెచ్చిపెట్టితివి? నన్ను వీడి యొక్కనిముస మైన మసలనివాఁడవు నేఁ డీకారణంబున నే కాఁబోలు న న్నింట నొంటిగ వీడి యావేగంటి రాయనిసభ బంటుతనంపుమాటలు పెక్కింటిని బల్కితివి. నే నున్న మాత్ర మేమి చేయఁ గలదాన. ఆడదాని కింతభీతిల్లెడివాఁడ వావలి కార్యంబు నెట్లు సాధించుకొందువు? అయ్యో! నాజన్మ మెప్పుడు నిట్టియిక్కట్టులలో నే మునిఁగి తేలెడి దయ్యెఁ గా! ఛీ! యీతుచ్ఛపు జన్మ నే నేల యెత్తితిని. మానాభిమానంబులు లేనియీబ్రతు కేల? కాల్పనా? ఓరమాకుమారా! ఏ నీకు విరసంబు లేమి చేసితి? నాయెడ నింతదయ తప్పఁ జెల్లునా? ఆహా! పాలలోనిబల్లివలె తల్లడిల్లు చుండు టయె గాని నాయుసురు లీకాయంబునుండి బయట పడి పరితాప దవాగ్నిని దప్పించుకొనఁ జాల కున్నవి. ఓవిధాతా! నా కీకష్టంపు బ్రతు కేల వ్రాసితివి? ని న్నన నేమి? నాపూర్వజన్మసుకృతము నెంచు కొనవలెను. నిముసంబు మన దనుకొన రాదు. ఇఁక నేమి మూడ నున్నదో? ఈపరిభవానలంబున నాయెడ లంతయు మండు చున్నది. ఇఁక దీని కోపఁ [illegible] ప్రాణంబు లీకాయంబు వీడి సౌఖ్యంపుతావు [illegible]చుతెరం[illegible]వాలా[illegible]చింతును గాక. అయ్యో! మనోహరా!

గీ. గారవము మీఱఁగా నన్నుఁ జేరఁ దివిచి
మానవతి! మేను లే రెండు గాని మనకుఁ
బ్రాణ మొక్కటి యే యంచుఁ బలుకువాఁడ
వక్కటా! యది రిత్త సేయంగఁ జనునె.

గీ. కటకటా! యెట్లు విని సైపఁ గలుగుదాన
మరునియిల్లాలు రతి యనుమాట పోయి
మరునియిల్లాలు రాగమంజరి యటంచుఁ
బుట్టె నిట్టికష్టము తెచ్చిపెట్టునె విధి.

ఆహా! మదనా! నీవలన నింక నెట్టివింతలు పుట్ట నున్నవో కదా!
(అని యాలోచించు చున్నది.)

[మన్మథుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

మన్మ—(నలుదిక్కులు పరికించి)

సీ. రమణీయ మగుమందిరంబు వెల్వెల బోయి
కానిపించెడు నేమి కతన నొక్కొ
పలువురుచెలికత్తియలు కొల్వఁ గొలువుండు
ప్రియకాంత యేల కాన్పింప దొక్కొ
నియమితకార్యసన్నిహితచిత్తలు గాక
చేటీజనం బేడఁ జేరి రొక్కొ
కలరవంబులను వీనులకు విందు లొనర్చు
కీరవారం బేల కినిసె నొక్కొ

గీ. పాడుపడి యున్నచందంబు నేఁడు జూడ
గృహము గ్రహ మయ్యె మనసు తొ[illegible]లుచు నుండె
వింతవింతగఁ దోఁచె నే జింతలోనె
కారణం బేమియో మది గాన రాదు.

చ. చెలఁగుచు చెల్మికత్తియలచేత మదాగమనప్రకారముఞ్
దెలిసి ముదంబు కన్నులను దెల్లముగా నెదు రేగుదెంచి కో
మలతరబాహువల్లరులమధ్యమునఞ్ ననుఁ జేర్చి లోని క
గ్గల మగుప్రేమ గొంచు జనుకామిని నేఁ డటు లేల సేయదో.

అయిన నీచిలుకపిండు నడిగి తెలిసికొందును గాక.

చ. చివురులకంటె మెత్త నగుచేతుల మీమృదులాంగకంబులఞ్
నివురుచు ముద్దుపాటలను నేర్పుచు వేళ యెఱింగి యెప్పుడుఞ్
వివిధఫలోత్కరంబులను విం దిడు మీయజమానురాలు మి
మ్ము విడిచి యిప్పు డెందులకుఁ బోయెను? కీరములార! తెల్పరే?

(ఇంచుకసేపు తాళి) ఎందు వెదకినను చెలి కాన రాదు. ఏమి సేయు దును. హా! నారాగమంజరీ! యెం దున్నదానవే? నీమోము చందురుం జూపి నాదృక్చకోరంబుల కేల యానందంబు గలుగఁ జేయవు? నేఁడు నాతోఁ బలుకకుండుటకు నే నేమితప్పు చేసితిని. పోనీ పలుక కున్న కన్నులార గాంచుట కైన లే దయ్యె. ఆహా! నేఁ డెంతటియమవ సనిసి యయ్యెను.

రతి—(తనలో) నాపతి నాకొఱకై వెదకుచు రాగమంజరీమోహాతిరేకం బునఁ బిల్చు చున్నవాఁడు. (ప్రకాశముగా) నీరాగమంజరి దక్షవాటి యం దుండును. రతీసౌధమ్మున నేల పిచ్చివానివలె వెదకెదవు? అచ్చటి కేగుము.

మన్మ—(ఆలించి) ఇది యేమి? రాగమంజరి యెవ్వరు? దక్షపురి యేమి? ఆపలికిన దెవ్వరు? (యోజించి) నా నెచ్చెలి
యుండెనా? ఓహో! మోసంబు వాటిల్లెనే?

[illegible] బుట్టె బృందారకేంద్రుసభను?
[illegible] నెప్పు డియ్యవి బ్రాక [illegible]?

కులసతికి నెవ్వ డెలిసెనో? గోడలకును
చెవులు గల వనుమాట నిక్కువమె యరయ్య.

ఈధ్వని యీదిక్కునుండియే నా వచ్చినది? చూతము (కొంచెము నడచి) అదిగో! నానెచ్చెలి. ఏలయో విచారగ్రస్త యై యచ్చట గూరుచుండి యే మేమియో విచారించు చున్నది. (సమీపించి) ప్రాణసఖీ!

గీ. నెచ్చెలుల వీడి వైభవం బిచ్చగింప
కొంటరిగఁ జింత మై నిట్టు లుంటి వేల?
లోకసుఖముల నెల్లను లోను పఱచి
క్షితిని నేకరీతి నుండు యోగినివిధాన.

నీ విట్టు లుండుటచే నాస్వాంతంబు చింతాకులిత మై చిక్కు చెంది యున్నది సుమా!

గీ. పలుకు పలుకున గప్రంపుఁ బలుకు లొలుకు
ముద్దుపలుకులఁ బ్రియమాఱ బుజ్జగించి
చింత వాయంగ బిగి కౌఁగిలింత లొసఁగ
రాదె దాసునకో యనురాగపేటి!

(అని కౌఁగిలించుకొను చున్నాఁడు.)

రతి—(కౌఁగిలి విడిపించుకొని) మీయనురాగపేటి దక్షవాటిలో నున్న బోటి కాదా! నే నెట్లుగుదును. నన్నంటకుడు.

మన్మ—(విషాదముతో) అ దేమి. అట్లు పలుకు చుంటివి. నేఁ జేసినతప్పేమి గలదు. నీదంటమాటలవలన నా కేమియుఁ దెలియక నామనంబు మఱింతకలక బాఱు చున్నది.

క. నీయధరసుధారసము, ను
పాయనముగ నిచ్చినట్టు లైన సుదతిరో!
నాయలమట వాయును, గరు
ణాయతమతి నీయవలవదా? దాసునకున్.

(అని యధరపానము గోరు చున్నాఁడు.)

రతి—(చేతుల నడ్డము పెట్టి) అది యనురాగ మున్నచోట గాని కూడదు.

మన్మ—ప్రియురాలా! నీకన్న నాకెక్కు డనురాగము గలవా రెవ్వరు?

రతి—మీబూటకముల కేమి లెండి. మీప్రవర్తన లెవ్వరికిఁ దెలియవు. పిల్లి కన్నులుమూసికొని పాలు ద్రావుచుఁ దన్ను లోకులు చూడ రనుకొనునఁట. చాలు. చాలు. ఇంద్రునిసభలో జరిగినయావద్వృత్తాంతమును నాకుఁ దెలియ లే దనుకొంటిరా యేమి? యానంగనాచితో బొం దొనర్పవలె ననిగా యిట్టివన్నిగడ పన్నితిరి?

మన్మ—ఇదియా! నీవిచ్చియూహ. అచ్చట జరిగినవృత్తాంతం బంతయు నీ కామూలాగ్రముగఁ జెప్పెద. దాని నాలించి పిమ్మట నాయందుఁ దప్పు గల దని తోఁచిన నీయిష్టముచొప్పున నన్ను శాసింపుము. నేను దాని లో నగువాఁడను.

రతి—నాకుఁ జెప్ప నక్కఱ లేదు. ఇంద్రునకుఁ దోఁచినసంశయంబు మొదలు మీమీప్రతిజ్ఞాదివృత్తాంతంబువఱకును నే నెఱుంగుదును. ఇది యంతయును దానికొఱకే గాదా?

మన్మ—అది యేది?

రతి—దాని పేరు తలంచిన నాయొడలు భగ్గు రను చున్నది. ఆ[illegible]వర యడిగితిరి గాన వాక్రుచ్చెద. రాగమంజరి.

మన్మ—అది దైవశాసనంబున నట్లు సంభవించె. రాగమంజరి యనునచ్చర ప్రోయాలాదక్షపురిం గల దనియు దానిరూపధనాధిపతు లిర్వురిలో నెవ్వరు వశపఱచుకొనెదరో వారు లోకంబున నాధిక్యస్థానంబు నొందుదు రనియుఁ జెప్పఁబడియుండుటయే మనల నింతకుఁ దెచ్చినది. ఇంతకును దేవేంద్రసభలో రూపధనములను గూర్చి సంశయంబు దోఁచి నప్పుడు నాకుఁ దెలిసినయంశంబుఁ దెలుపక యూరకున్న గౌరవహీనత గాదే. గౌరవంబు పోయిన దప లోకంబునఁ బ్రతికిన నేమిప్రయో

జనము? ఇట్టియంశంబులు తెలిసియు వాని కెద్దియో మిష కల్పించి యవజ్ఞలపాల్కి నీవును నిట్లు కలపించిన నే నేమి చేయువాఁడ.

ఉ. మీనపతాకుఁ డోడెను సుమీ యని లోకులు చెప్పుచుండఁగా
వీనుల విన్నమాత్రమున వేసట నొందక యెట్లు లోర్తువో
మానిని! యించుకంత నిజమానసవీథిని నెంచుకొమ్మ నీ
కై నెర నమ్మియున్న నను నారడి పుచ్చుట మంచి దౌనొకో.

రతి — ఆఁ కార్యసాఫల్యమునకై యుక్తు లనేకం బెఱిఁగింప వచ్చును. మీ యుక్తులు, మీయుపాయంబులు, మీ మెత్తనిమాటలు నే నెఱుంగనివి కావు. ఇంతకును నాయదృష్టఫల మి ట్లుండ మి మ్మన బ నే మున్నది.

మన్మ — (తనలో) దారిలోనికి వచ్చు చున్నది. మంచిమాట నచ్చ చెప్పెదను గాక (ప్రకాశముగా) ప్రియసఖీ! నాకు నీకంటె లోకంబున మనోహారిణు లెవ్వరు? నిన్ను వీడి నిముసం బైన తాళగల్గనా? నీ కీయపార్థంబు లెవ్వ రుపదేశించిరి? ఆయింద్రసభ నట్లు ప్రతిన వట్టి నీ యనుమతి పొంది పోవుద మని యిచ్చటికి విచ్చేసితిని. కార్యాకార్యము లెఱింగి ప్రవర్తించినం గాని హాని వాటిల్లు.

చ. కలికిరో! లేనిపోని విటు కల్పనఁ జేసి మదీయచిత్తముఁ
గలఁచిన నాయొనర్పఁ గలకార్య మ దెట్టులు సిద్ధి బొందునో
తెలియును నీదు నెమ్మదిని; తెల్పెద నొక్కడ కారణంబ నా
వలనను గిన్క జూపఁ దగువాఁడను గా నని మానినీమణీ.

రతి — అట్లు గానిచో దేవకార్యం బైనవెంట నే భవత్సమాగమసుఖానందంబున నన్నుం దేర్చి న న్నెన్నఁడును విడనాడ నని నాచేతిలోఁ జేయి వేయుఁడు. ఈబాస నా కిచ్చిన నేను నమ్ముదానను.

మన్మ — అట్టులే యొనర్చువాఁడను. (అని చేతిలోఁ జేయి వేయు చున్నాఁడు.)

రతి — ఆర్యపుత్రా! మీ రెన్నిదినంబు లచ్చట నుందురో కదా! నాకు దివస [illegible] యుగముగాఁ దోఁచు చుండును. ఏ నింతవఱ కజ్ఞానంబునఁ [illegible] నతాతప్పులం సైరింప వేఁడు చున్నదానను.

మన్మ—ప్రాణసఖీ! ఇంద్రు నీత ప్పేమి యున్నది? నీ వట్లు దిగ్భ్రమంబున వేఱుగ నెంచి క్రమ్మఱ మద్వాక్యంబుల యథాస్థానంబునకు వచ్చితి వంతియె చాలును.

రతి—నాథా! పురహరమిత్రుం డైనయాధనదునితోడఁ గలహంబు మీ కేల సంప్రాప్తం బయ్యె. వెనుకటివృత్తాంతంబుఁ దలంచుకొన్న నాయొడలు కంపర మెత్తు చున్నది. (కంపము నభినయించు చున్నది.)

మన్మ—(కౌఁగిటఁ జేర్చి) నీ కాభయ మేల? అది యట్లు జరుగవలసి జరిగె. మనదివసంబులు మంచి వైన హరుం డేమి చేయును. శత్రుండె మిత్రుం డగు. నీ వాచింత యావంతయు మనంబునఁ బెట్టుకొనకుము. ఏ [illegible] నేతత్ప్రయత్నంబున జాగరూకుండ నై యుండ వలెను. కావున సెల వొసంగుము పోయి వచ్చెదను.

రతి—మిమ్ము వీడి నేను నిముస మైన నుండఁ జాలను. అయిన నే నిప్పు డడ్డు వెట్టినచో మీప్రతిన చెఱచినదాన నగుదును. దాన మీకుఁ గల్గుహాని నాది కాదా. గాన దిగ్విజయుల రై యతిశీఘ్రముగ రండు. శుభం బగు గాక.

మన్మ—నీ వితరంబుగ నెంచకుము. నే నిక్కడ నుండిన ట్లే వచ్చెదను. (కొన్నియడుగులు నడచి తనలో)

గీ. ఊరకయె లేనిపోనిశోపారభటిని
నింటియిల్లాలె కలఁచి న న్నింత జేసె
నేను పోయెడికార్య మె ట్లౌను యనుచు
సందియము నొందుచున్నాఁడ డెందమందు.

ఏమీ! యీపిచ్చిభయము.

ఉ. కార్య[illegible] బెఱుంగ కొకకాంత చెవిం బడినంతమాత్ర[illegible]
దుర్యశ[illegible]ందఁ బల్కు కదుపూరుదు రంగన [illegible]

ధైర్యము నూని వాని నొకదారిన ద్రోసి క్రియాప్రచారులై
పర్యవసానతజ్ఞతశుభస్థితి గాంచెద రుత్తమోత్తముల్.

(నిష్క్రమించు చున్నాఁడు.)

రతి—నానాథుని విడిచియుండుటకు నామన సొప్పకున్నది. కార్యభార వశుండైనయాతని కేయుపద్రవమును రాకుండ నయ్యీశ్వరునిఁ బ్రార్థింతును గాక.

(అని నిష్క్రమించు చున్నది.)

ఇది ద్వితీయాంకము.

# ధ నా భి రా మ ము.

## తృ తీ యాం క ము.

రంగము—మనోహరమందిరప్రాంగణము.

[చేటి ప్రవేశించు చున్నది]

చేటి—“ప్రాణసఖీ! మన్మనోహరుం డగు నెుక్క జగన్మోహనాకారుం డీదక్షవాటీదేవదేవాలయమంటపాగ్రసీమ, తన తేజంబు నెల్లెడం బర్వింపుచు, మానినీచిత్తచోరుం డై విహరింపు చుండెను. మత్ప్రాణానిలంబులు వేదనానలంబున ప్రమగ్గక ము న్నయసమానరూపలావణ్యాదిక్యరణ్యునితో నన్నుం గూర్చి, నీసఖీత్వంబు నేఁడు సార్థకంబునకుఁ దెచ్చికొమ్ము” అని నాచెలి యగురాగమంజరి మన్మథవేదనాధీనమానస యై నా కాజ్ఞాపించి యుండెను. ఆహా! ప్రాణసఖీ ప్రాణసంరక్షణాధీనమానసోన్మాద నై వెనుక ముందు లారయక నాయావచ్ఛక్తిని ధారవోసి, నాచతురత్వంబున నాయభినవమకరాంకుని నీయధీనంబు చేసెద నని నానెచ్చెలికి మాట యిచ్చి వచ్చితిని. నే నాపూరుషవర్యునికడ కేగి యేవిధి మాట్లాడుదాన? ఆడుదాన నగునావచనంబుల నాతండు పాటిగాఁ బట్టునో లేదో? మునుమున్న యాపూరుషునిచిత్తవృత్తిం గనిపెట్టి గాని యెట్టి ప్రసంగంబునకుం బోరాదు. పూరుషుం డెంతటియసమర్థుం డైనను, పొల్తితొల్త తనమనోరథంబు వెలి బుచ్చిన దాని నాతండు మివులచులుకనగాఁ జూచు. అందున నీతండు జగన్మోహనాకారుండు నతిచతురుండు నఁట. వినియుక్కు మొంగ [illegible]న నెఱుంగకుండ నే నెట్లు సంభాషించి నాకేలం ద్రోచికొని, నాప్రాణసఖీప్రాణంబులం గాపాడి, లోకంబున

నాయెత్తినజన్మంబు సార్థకంబు చేసికొందునో యెఱుంగఁజాల కున్నాను. ఇంతకు సర్వేశ్వరుం డగునాభీమేశ్వరుండె నాకుఁ దోడుపడును గాక. అధైర్యపడిన నేమిప్రయోజనము? అడి తప్పిన నంతకంటె, లోకంబున హీనకృత్యంబు లేదు గదా! ఎట్లు లైన నాప్రతిభావిశేషంబు లాతని ముందుఁ జూపి ప్రాణసఖీప్రాణత్రాణంబుఁ గావించి నాసఖీత్వం బా యమకు శుభగత్వంబుగా నెలకొల్పెద. (అలుకుడు విని ముందునకుఁ జూచి) అదిగో నెవరో యిటు వచ్చు చున్నట్లు లున్నది. ఈదిక్కున నుండి యడుగులచప్పుడు విన వచ్చు చున్నది. (రెం డడుగులు ముందు నకు నడిచి చూచి) ఓహో! మిత్రుండు కామపాలుండా యేమి?

[అంతఁ గామపాలుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

కామ—ఓహోహో! చతురికా! బహుకాలదర్శనము. నాఁడు దేవళంబున స్వామివారికళ్యాణమహోత్సవంబున నీచెలితో వచ్చినప్పుడు చూచితిని. నాటికి నేఁ డాదర్శనము? బాగుగ నున్నావా?

చతు—అఁ. నీదయవలన నీలాగు—

కామ—నాదయ, నాలాగునా? నాదయ యన నేల? దేవునిదయ యనుము.

చతు—అదియును దైవకృపవల్ల నీగడియవఱకు—

కామ—కాలు సేతు లాడు చున్న వేమి?

చతు—అట్లగుటచేత నే నోటి కొకముద్ద పోవు చున్నది.

కామ—నీచాతుర్యముల కేమి లే. నీమాటలు విని చాలదనము లైనది. కాని నా కావలఁ దొందరపని యుండుటచే వినుట కవకాశము లేదు. పోయి వచ్చెద. దయ మాత్ర ముంచుము.

చతు—మిత్రుఁడా! యేమి యాతొందర? ఆవల నే మైన మునిఁగి పోవు చున్నదా యేమి?

కామ—అఁ. మునిఁగి పోవుచునే యున్నది. వేళకు సరిగ, ఆయనతో నుండనిచో ముందు నాతాళిము పట్టుదురు.

చతు—కామపాలా! ఆయన యెవరు?

కామ—ఇంకను నీకుఁ దెలియదా యేమి? యీమధ్య మనపురంబునకుఁ దాను సర్వవిద్యాలయం దారి తేఱినవాఁడ నని యొకశృంగారపురుషుండు వచ్చి యున్నవార్త?

చతు—ఆఁ. ఒకమోహనాకారుండు వచ్చె ననియు భీమేశ్వరాలయమంటపాంగణమున కావలగ నున్నమందిరంబున విడిసి యున్నవాఁ డనియుఁ, దాను చూచితి ననియు నాయజమానురాలు నాతోఁ జెప్పఁగా విని యున్న దానను.

కామ—అదిగో! ఆమహానుభావుఁ డీపట్టణంబుననుండినన్ని నాళ్లును వానికిఁ బరిచర్య సేయు చుండు మని నాయజమానుండు నాకు నియమించి యున్నాఁడు.

చతు—(తనలో) మన మీతనిఁ గూర్చియే పోవు చుంటిమి. వీని కీతని సంగతి బాగుగఁ దెలియును. కావున వీని నింకను గొంతప్రసంగవశమునకు దింపి నాకుఁ గావలసినసంగతులు గ్రహించి మఱిఁ బంపెదను. (ప్రకాశముగా) ఓయీ! ఆతనిదేశం బెద్దియో, కుల మెద్దియో, యెట్టివాఁడో, నా కించుక చెప్పెదవా?

కామ—ఆయనది యవంతిపుర మఁట. ప్రసిద్ధం బగురాజకులంబున జన్మించినవాఁ డఁట. పేరు మనోహరుం డఁట.

చతు—మనోహరుం డేమి!

కామ—వేయిమాట లేల? మనోహరుం డనునామం బాతనికే సార్థకం బగును. చూడఁ జూడ, త్రిజగన్మోహనుం డగునయ్యిందిరాసుందరీనందనుండే యీయవనీతలంబున కవతరించి యీలీలఁ గ్రుమ్మరుచుండెడి నని నాబుద్ధికిఁ దోఁచు చున్నది. లేకున్న, నారూపసంపదయు, నాయెలప్రాయంపుసిరియు, లోకంబువారి కేల కలుగ కుండు?

చతు—(తనలో) ఇంతటిరూపవంతుండు కావుననే, ధనంబునకై తనతల్లి తన్నెట్టిదూషణభాషణంబులకు లోను జేసినను, వాని నెల్లఁ బెడచెవిం బెట్టి, మనంబు లేనిబోధనం బేమి యని తలంచి, కులరూపవయోవిద్యావిశాలుం డగునొక్కపూరుషవర్యుండు చేకూఱినఁ జే పట్టుదు ననియుఁ గాని నాఁడు యోగిని నై భగవతీసేవాకైంకర్యంబున ముక్తి పొందుదు ననియుఁ బ్రతిన వట్టిననానెచ్చెలి యగురాగమంజరి, యేతద్గుణాధిక్షిప్తితుం డైన యీతని వలచి మారవికారంబునకు లో నై యున్నది. సామాన్యమనుజుం డైన నేల యీలీల మనోధృతి తూల జేల యై తాను జాలిం బొందినతెఱం గంతయు నా కెఱింగించి న న్నిట్టికార్యంబున కనుపఁ జూచు? నాయెడమక న్నదరు చున్నది. శుభసూచకం బె కదా! (అని తల యూచు చున్నది.)

కామ—చతురికా! ఏమియో యాలోచించు చున్నదానివలె నట్లు తల యూచు చుంటి వేమి?

చతు—ఏమియు లేదు. ఇంతటిరూపసంపత్తి గలయీతఁ డెట్టికారణజన్ముఁడో యని యోజించు చుంటిని.

కామ—(ప్రొద్దు వంకఁ జూచి) అయ్యో! నాకొంప మునిఁగినది. రెండు గంటలు దాటిన దే? నే నింటియొద్ద నకారణకలహ మొకటిఁ దెచ్చి పెట్టుకొని నాకూటిలో మన్నుఁ గొట్టుకొంటిని. ఇఁక నే నిలువ. పోయి వచ్చెద. (అని నిష్క్రమించి రోజుచు మరల వచ్చి) అకటా! నే నిం కేమిసేయుదును? చలువగాలివిహారంబునకై యాతం డీపూలతోఁట కేగె నఁట. నాజాగుసేత కలిగి నాయజమానునితో నేమి చెప్పునో కదా? ప్రోలుమాలికకలవాఁడును, మందమతియు, దుందుడుకువాఁడును, ఇట్టిసేవకావృత్తి నుండఁ జనదు. అచ్చటికిఁ బోయి వాని శరణము వేఁడి క్షమాపణముఁ జెప్పికొనియెద. ఆవల దైవం బున్నవాఁడు.

చతు—ఓయీ! ఇంతమాత్రమున కంతతొట్రుపడెద వేల?

కామ—తొట్రు కాదా? గొప్పవారితోఁ బని?

చతు—ప్రథమాపరాధ మనుము.

కామ—ప్రథమాపరాధ మైన నింత యేల?

చతు—సరియె. బాగున్నది. నిన్నుఁ జూచి ధైర్యము చెందితిని గాని యిఁక నేనును నీతోడిపాటే.

కామ—అది యేమి?

చతు—నే నొకకార్యమును గూర్చి యాతనియొద్దకే వచ్చుచుంటిని. అందు నీసహాయము—

కామ—సరె. నాబ్రతుకొకటి బయలు వడక దట్ట మైన గదా! చూతము. కాని నీవు నాతోడ మాత్రము రాకు సుమా! కొంచెమునే వుండి రమ్ము.

చతు—నే నీప్రక్క నుండి మెల్లఁగా వచ్చెదను. పోదము పద.

(అని యిద్దఱు నిష్క్రమించు చున్నారు.)

ఇది విష్కంభము.

---

# తృతీయాంకము.

---

రంగము—పుష్పవనము.

[మనోహరుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

మనో—

ఉ. ఈపురి కేను వచ్చి గణియింపఁగఁ గొన్నిదినంబు లాయె నిం
దేపున నెల్లవారి భ్రమియింపఁగఁ జేసినవాఁడఁ గాని, నా
కాపరితోష మిం తయిన నందఁగ రా దలరాగమంజరీ
నైపుణి మీఱ నింతకును నావలలోఁ నిఱికింపకుండుటన్.

నే వచ్చినతఱి నామె యొకసారి భీమనాథునిసేవకై యాలయంబున కరుదెంచి నన్నుం గాంచి యనురాగంపుఁజూపులం బ్రసరింపఁ జేసి పోయెనే గాని నేటివఱకును నే మయ్యెనో యామెజాడ మరలఁ దెలియ దయ్యె. కార్యవాదుల కెప్పుడును కాలంబు వృథ సేయుట కూడదు. నాఁడు నారూపవిశేషవిభ్రమంబుల నన్నిఁటిఁ గ్రమక్రమముగ నావారనారీమణిముందు కనపఱచియే యుంటిని. ఆసమయమున

చ. మన మలరంగ మోవిపయి మాటికిఁ జిఱ్ఱగ వంకురింప, జ
వ్వనిప్రియ మాఱ నన్నుఁ దనవాలికచూపుల, గారవించుచుఁ
బని విని వెన్కవెన్కకును బల్మఱు జూచుచుఁ, గాన నాకు నా
వనజదళాక్షి చిక్కిన దవశ్య మటంచును నెంతు నెమ్మదిన్.

సమయంబు చిక్కనికారణంబున నాచక్కరబొమ్మ యింతకు విరహతాపమున దూగులాడుచునే యుండును. కావున నెటు లైన నాకొఱ కెవ్వరి నైనఁ దప్పక పంపును. లేక తానే వచ్చును. అట్లనుకొన నేల? స్త్రీలమనంబులు చంచలంబులు గదా! నాటికి నాఁ డట్లు చూపి పిదప విరక్తమార్గంబున నూరకొన్న దేమో? అధనదుండు రాకమున్న దీనిని నావశవర్తిం జేసికొన్న గాని మిగిలినపిదప గతజలసేతుబంధనంబునకుఁ గడంగిన ట్లగు. నన్ను వలచిన దే యైనచో నిన్నిదినంబు లాయింతి యేల యాలసించు? "అభావో విరక్తిః" అనునట్లు నేను వశంవదుఁడఁ గా నని యీప్రయత్నము మానుకొనియె నేమో? లేక నిజరూపవిభవాతిశయంబున నన్ను సరకుగొనక నుపేక్ష యొనర్చెనో? (గర్వముతో) అ ట్లేల యగు?

చ. పురహరు నట్టివాఁడె యుడి వోయినబీరముతోడ నాఁడు దు
ర్భర మగుమచ్ఛరాళికి విరాళిని బొంది సదా నిజప్రియా
శరణముఁ జెందియుండుననె సామయియుండఁగ నాకుఁ దక్కరుల్
పురుషులు కామినీమణులు బోలఁగ నెక్కటి నొక్క లెక్కయే.

ఈసంగతి నేఁడు కామపాలునితో యోజించెదఁ గాక.

[కామపాలుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

కామ—దేవా! నమస్కారము.

మనో—ఇంటి కేగి యింతతడ వాలసించితి వేల?

కామ—దేవా! క్షమియింపుఁడు. నా కింటికడ నకారణకలహ మొక్కటి సంప్రాప్త మైనది. అందుమూలమున నాలసింపవలసినవాఁడ నైతి. (అని పాదములపైఁ బడు చున్నాఁడు.)

మనో—(తనలో) ఏరికి నిట్టిర ట్టే కదా కలిగి యుండును. (ప్రకాశముగ) చాలు చాలు. ఒడ లెఱుంగనిసేవమా! ఈసారి క్షమియించితి. ఇఁక నొక్కతడవ నిట్టియాలస్యం బొనరించినచో నీజీవనంబునకు నీళ్లు వదలు కొనవలసినదే.

కామ—చిత్తము. చిత్తము. (తనలో) అమ్మయ్యా! నేటికి పులినోటినుండి వీడిపడినకండమాడ్కి నీయుపద్రవమునుండి బయలు వడఁ గంటి. ఎప్పుడు నొకరిక్రింద సేవకావృత్తికిఁ గుదురుటకంటె హీనకార్యము లేదు. ఏమిచేయను? ఇంతకన్న మఱియొకవ్యాపారం బొనర్చుకొంద మన్న నాయొద్ద ధనము లేదు. జీవించినన్నినాళ్లు నిట్లే తలవంచుకొని భార్యాపుత్రాదులఁ బోషించుకొనుట తప్పదు! ఆవిధి యెట్లు వ్రాసిన నట్లు తప్పక తిరుగులాడుచుండుట మనుజుల కెల్ల గర్తవ్యంబు.

మనో—కామపాలా! నే ని ట్లంటి నని యాచిన్న వోయి యుంటివి? ఇది నీకొఱకే చెప్పితిని. మఱియొకలాగున నెంచికొనకుము. ఱేపు నా యొద్ద గాక మఱియొకరికడ నైన నిట్లు ప్రవర్తింపక బుద్ధి గలిగి జాగరూకతతో వర్తింతు వని చెప్పవలసి వచ్చె.

కామ—చిత్తము. తాము సెల విచ్చిన వన్నియు నాకొఱకే. నేను మఱియొకలాగు తలంచికొనుట కంత వెఱ్ఱినా యేమి? సేవకులయెడఁ దప్పు గలిగిన ప్రభువులు మందలింపరా! దీన నా కింతయైన వంత లేదు.

మనో—కా నిమ్ము. పూలతోఁటం గలవిశేషములం జూచివత్తము ముందు నడువుము.

కామ—చిత్తము. (అని యిర్వురు కొన్నియడుగులు నడుచు చున్నారు.)

కామ—దేవా! యీచివురాకుజొంపముల నల్లిబిల్లిగ నున్నయీలేమావి గున్నం జూడుఁడు. ఇయ్యది నోళ్లు పడియున్నకోయిలలకు వెజ్జువలె నెప్పుచు మహౌషధప్రాయంబులగు తనతలిరుల నిచ్చి మనోహరంబుగ వానిం గూయునట్లు చేయు చున్నది.

మనో—మేలు! కామపాలాఁ బాగుగ నుడివితివి.

కామ—అయ్యది చంపకము. దేవజాతితరుపుష్పసంతానములతో సఖ్యం బొనర్ప వేగు చున్న దన నిజపుష్పసౌరభంబుల వాయువశంబున నవనీతలంబునుండి యాకసంబునకుం బంపుచు వియత్పథంబున విహరించు వేలుపుమూఁకల కామోదంబు వెల్లి గొల్పు చున్నది. దానిం జూడుఁడు.

మనో—కామపాలా!

గీ. దీనివలపులు మధుపసంతానమునకుఁ
బ్రాణకంటకములు గానవలదు మెచ్చ;
సర్వజనసమాదరణీయ ముర్వి యెదియొ
యదియె స్తుతిపాత్ర మనుచు నాయాత్మఁ దలఁతు.

కామ—స్వామీ! అది య ట్లనరాదు. సర్వలోకతమోనిరాసనుం డగు భాస్వంతుండు, క్షపాసమయవికసితోల్లసనంబు లగుకలువగుంపున కదర్శనీయుండును బ్రాణకంటకుండు నయ్యు లోకానందకరుం డెట్లు కాకుండు?

మనో—నీవు చెప్పినది కా దన రాదు గాని సర్వజనసమాదరణీయం బెద్దియొ యదియె స్తుతిపాత్రం బని నాయభిమతము.

కామ—దేవా! తాము సెల విచ్చునది కాదనc జాలc గాని, సర్వజన నందితుం డగుసుజనుం డొకదుర్జనున కహితుండుగా నుండుట లోక సామాన్య మని తలంచెద.

మనో—ఓయివెఱ్ఱివాcడా! నీవు వక్కాణించెడియంశం బీపైయంశంబున కెంతమాత్రమును పత్తుట లేదు. ఎంతటిదుర్మతి యైనను, సుజనునియందలి గుణగణంబుల మనంబున గణింపుచుండి జాత్యంశంబునc బుట్టెడియహంకారంబును, ఈర్ష్యయుc బైకిc దోcపc జేయుచు నుండును. అది యటుండ నిమ్ము. ఇవ్వనరామణీయకంబు నాహృదయంబు నాకర్షించుచున్నది. ఈదెస కేగుదము రమ్ము. (అని కొన్నియడుగులు నడచుచున్నాcడు.)

కామ—స్వామీ! పూర్వకాలంబున నివ్వనంబు భీమేశ్వరాలయంబుతోడ సురగణంబులచే నిర్మింపcబడిన దని కావున దీనియం దీభూలోకంబున నెచ్చటను లేనివృక్షజాతు లన్నియుc బ్రోది యగు చున్నవి.

మనో—దేవతానిర్మితంబు కావుననే నందనంబునకును దీనికిని భేద మించుకయుc గానరానియంతటిమహోచ్ఛ్రదశం జెంది యివ్వనంబు ప్రకాశించుచున్నది. కానిచో దీని కీమహిమం బేల కలుగు?

కామ—దేవరవారీచంద్రకాంతశిలావినిర్మితవేదిపై నాసీనులరు కండు. ఇందలి క్రొత్తజాతిపుష్పంబులు కోసికొని వచ్చెద.

మనో—(అట్లు కూర్చుండి) కామపాలా! చూడు!

సీ. గుమిగూడి మురిపంబుc గురియించుచిన్నారి
నడలలోc జని దవ్వు దడవునవియుc,
బొదలెడుతమితమి గదిసి హంసంబుల
కిచకిచారవముల గేరునవియుc
గలువతూడులc జంచువుల నట్టె కొని కందు
వులకు నై తమమెడల్ మలcచునవియుc

మురువారు నెఱకల ముంచి నీరము నెత్తి
సారె దక్కుటులపైఁ జల్లు నవియు
గీ. నగుచు సంతోషజలధి నోలాడులీలఁ
గెరలి హంసాంగనలు జనకేళి సల్పు
చందమును గంటివే కనువిం దొనర్చి
యెదకు నూతనసంతోష మొదవఁ జేసె.

కామ—దేవా!

గీ. అంగనా పరిజనముల యట్టు లివియు
నైజకృత్యంబులను నెమ్మనంబు లధిక
జాగరూకత మెయిఁ జేర్చి సంచరించు
చున్న యవి చూపఱకు ముదం బొదవునటుల.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

[అప్పుడు చతురిక ప్రవేశించు చున్నది.]

చతు—(ఇటు నటు చూచి యాశ్చర్యముతో) ఎవ్వ రాచంద్రకాంతశిలా వితర్దికం గూరు చున్నవారు? (సవితర్కముగా) ఏమీ వీనిమోహనాకారత! కన్నులు మిఱుమిట్లు గొలుపు చున్నదే! మనోహరుం డీతఁ డేనా? ఈతండు మనోహరుం డనుటకే తగినవాఁడు. ఆహా! ఇందుననే నా నెచ్చెలి యీపచ్చవిల్తుసముం గోరి యున్నది. వీని నొక్కసారి కాంచిన లోకం బంతయు మోహవశతం జిక్కు చుండ నింక నా నెచ్చెలిమాట చెప్ప నేల? ఏమీ చంద్రబింబంబు దంబు విడంబించు నావోమున దరహాసచంద్రికలు దొరలు చుండ నా నేత్రచకోరిక త చ్చంద్రికాసుధాలహరిని మునింగి తేలు చున్నవి. (ఆశ్చర్యముతో) ఇది యేమి. ఇటు నటు త్రిప్పికొంద మన్నను దిరుగ కున్నవి? ఈతనికెడ నే దైన మోహనవిద్య యున్నదా యేమి? ఏమి నావెఱ్ఱి? ఈసురూపత పసయే మోహనవిద్య. (వెఱఁగుతో) ఇది యైంద్రజాలమా యేమి? నా

కన్నులయెదుట వీనియాకారంబు లనేకంబులు గానవచ్చు చున్న వేలయో?—చిత్తమా శమింపుము. ఆc. ఇది యేకాగ్రబుద్ధివలనఁ గలిగిన చిత్తచాంచల్యంబు. ఓచిత్తమా! నీ విట్లు తాలుములే కుండెద వేల? నీవు వహించినది కార్యభారంబు సుమా! (అని యించుక కనులు మూసికొని నిలువఁబడు చున్నది.)

మనో—నాకు నావచ్చినకార్యంబు గామి నీవినోదంబు లన్నియుఁ బ్రమోదంబులుగా నుండుట లేదు. రాగమంజరీవృత్తాంతం బామూలాగ్రముగ నీకామపాలునిచేఁ దెలిసికొని యుపకడ దీనికిఁ దగినప్రయత్నంబుఁ జేసి చూడవలయును. (ఇటు నటు చూచి) అదిగో! ఆలతాగారంపు మఱుఁగున నొకకాంత చరియింపుచున్నటుల గనపడు చున్నది. పరికించి చూచెదను గాక. (అట్లు చూచి) ఈప్రక్కకే మెల్ల మెల్లఁగా వచ్చు చున్నది. ఎందుల కీలతాంగి యీయుద్యానవనమునకు వచ్చెనో తెలిసికోనవలయును.

చతు—(కొంచెముదూరము నడిచి) ఇఁక వీనికడ కేగి వీనిగుట్టుమట్టులు నావచోనైపుణిచే గ్రహియించి పిదప నావృత్తాంతంబు సమయానుకూలంబుగ వాక్రుచ్చుదాన. (అని సమీపించి నమస్కరించు చున్నది.)

మనో—ఇష్టావాప్తి పొసంగుఁ గాత. కాంతా! నీ వెవ్వరిదానవు? ఒంటరిగ నీపూలతోఁటకేల వచ్చితివి? నీపే రెయ్యది? కుల మెద్ది? నీ వృత్తాంతంబు సర్వంబును జెప్పుము.

చతు—దేవా! నే నిచ్చటకు వచ్చుట నావృత్తాంతంబుఁ జెప్పుకొనుటకుఁ గాదు.

మనో—మ రెందుల కేతెంచితివి?

చతు—(తనలో) వీనివలననే వీనివృత్తాంతంబు నాకు విన నిచ్చ వొడము చున్నది. (ప్రకాశముగా) దేవరవారివృత్తాంతంబు సాంతంబుగ విన్నఁ గాని దాసురాలిచిత్తంబు స్వస్థతఁ బొంది తనవృత్తాంతంబు చెప్పుకొను

నంతటిసామర్థ్యంబు నొందఁజాలదు. కావునఁ బ్రభువువారిపావనం బైన నామాక్షరంబులు నాచెవిం జొన్పి నన్నుఁ గృతార్థచిత్తం జేయ వేఁడు కొను చున్నదాన.

మనో—(తనలో) ఇది దాసురాల నను చున్నది. దీనిం బట్టి చూడ నియ్యది చేటీజనంబులోనిది యని తోఁచు చున్నది. (ప్రకాశముగా)

చ. వనజదళాక్షి! నాయది యవంతిపురంబు నివాసభూమి; శూ
రనికరమెల్ల మెచ్చఁ దగురాచకొలంబునఁ బుట్టినాఁడ; మో
హనతరరూపసంపదల నంది మనోహరనామయుక్తి ధా
త్రిని బెనుపొందువాఁడ; వివరించితి నాకత యున్నరూపునన్.

గీ. ఈశ్వరేశ్వరుఁ డని లోకమేనిఁ బొగడు
నట్టిభీమేశుపట్టణ మవనిఁ బుణ్య
భూమి యని విని తద్దేవుఁ బూజ జేసి
పావనత్వంబు వడయంగ వచ్చినాఁడ.

ఇయ్యది నావృత్తాంతంబు.

చతు—(వికాసముతో తనలో) ఇఁక నాసంశయము వీడినది. ఆతఁడే యీతఁడు. లేనియెడల నీరూప మెక్కడ? చూడఁ జూడ నీతఁడు భూలోకమన్మథుఁ డనియే తోఁచు చున్నది. ఇంక నాకార్యంబు సాధించుకోఁ గలుగుదు. (ప్రకాశముగా) దేవా! ఈపురి వేశ్యారత్నంబులలో నాయకమణి యనిపించుకొనుచున్నరాగమంజరి యనుకాంతాలలామ కేను నెచ్చెలిని. నాపేరు చతురిక. ఏ నొకకార్యార్థమై దేవర సందర్శింప వచ్చితి. కావునక నావచనంబు లాలించినచో మనవి యొనర్చు కొందును.

మనో—(తనలో) ఆఁ. ఇఁక నాకార్యము గట్టెక్కినది. నేఁ గృతార్థుండ నైతిని. నే నించుక మనంబును వెలి బుచ్చక మాత్రము మాట్లాడు చుండె

దను. (ప్రకాశముగా) చెలియా! నీకు సందియం బేల? నీ వచ్చిన కార్యం బెద్దియో తెల్పుకొనుము.

చతు—మత్సఖి యగురాగమంజరిం దాము నాఁడు దేవళంబునఁ జూచి యుందురు.

మనో—నాఁ డెప్పుడు?

చతు—స్వామివారికళ్యాణోత్సమునాఁడు.

మనో—చూచినఁ జూచి యుందు నేమో? మా కదియే జ్ఞాపకమా?

చతు—పో నిండు. రాగమంజరి యను పేరును విని యుందురా?

మనో—ఆ. విని యున్నాము.

చతు—అరతనాలదొంతి తమ్ము నొకసారి దేవళంబున సందర్శించి యున్నది.

మనో—ఉండిన?

చతు—నాటనుండియు మారవికారంబునకు లోనై తమపాం—(అని సిగ్గుచే నూరకొను చున్నది.)

మనో—ఓహో! ఇదియా! (నవ్వుతో)

గీ. అతివ! పరదేశవాసుల మై చరించు
నట్టి మే మేడ? స్త్రీవిషయంబు లేడ?
నయవిదులు విన్న నీమాట నవ్వి పోరె!
అదియుఁ గా కొక్కనియమ మున్నది లతాంగి.

ఏము పుణ్యతీర్థసంసేవనమునకై బయలుదేరినవారము. ఇది మావ్రతము. ఇం దెట్టిలోపంబు లొనరించినను దత్ఫలంబు నశియించును.

చతు—దేవా! నవనీతకోమలం బైనయీదేహంబును నిట్టిసంచారమూలంబున నేల శుష్కింపఁ జేసికొందురు!

మనో— గీ. భామ! మాశుష్కతయును మాకోమలతయుఁ
దడవ నీ కేల? విధి యెవ్విధాన వ్రాసె

నట్టు లెవ్వారుఁ జరియింప నగును గాని
కా దని మ ఱొండురీతిగాఁ గదల వశమె.

పాపము! నీ కీ లేనిపోనియాయాసం బేల? నీ వింక మాకడ నిట్టి మాటలం జెప్పకుము. నీకు మఱి దేనియందేనిఁ గోరిక యున్నచోఁ గోరు మిచ్చెదము. లేనిచో పని చెలుపుమాటలతోఁ బ్రయోజనం బేమి?

చతు—దేవా! ఇవి పని చెలుపుమాటలు కావు. దేవరవారు మీసేవకు రాలియం ది ట్లాగ్రహపడిన నిఁక నాదరించువా రెవ్వరు? నేను పని చెలుపుమాటలు చెప్పుట కంతమూఢురాలనా?

మనో—ఇట్టిపొత్తులు వలదు.

చతు—(తనలో) అగు నగును. వనితలు తమంత తా వలచిన నెట్టివారును జులకనగాఁ జూతురు. ఇది యొక్కరితెలనె పుట్టలేదు. లోకంబున కంతకును గలదు. (ప్రకాశముగా) దేవా! సకలలక్షణలక్షితాంగి యగు నొక కాంతాలలామ తనంతఁ దా వలచి వచ్చినఁ గా దని తిరస్కరించుట సిరి రా మోకా లొడ్డినచందం బగు నని తలంచెద. ఇది వార కాంత యని సంశయించు చుంటి వేమో? అట్టియవగుణంబు లీయింతి యం దెవియు లే వని యదార్థముగ నేఁ జెప్పఁగలను.

మనో— ఆ. సుదతి! నీ వచించుగొప్ప నమ్మఁగఁ జాల
వారకాంత లేడ? వలచు టేడ?
దొంగ యొట్టుఁ బెట్ట వెంగలితనమునఁ
జేతిసొమ్ము విడుచు నాతఁ డున్నె.

చతు—దేవరవా ర ట్టనఁ జెల్లదు. నామాట నమ్ముఁడు.

మనో—దాని కేమి లే.

ఉ. అచ్చపు నేస్తకాండ్రతన మచ్చుపడంగ జనాళి నమ్మఁగా
మచ్చిక మీఱఁగాఁ దిరిగి మాయలు వన్ని ధనంబు దుల్చి కొం

చెచ్చటికేని దారి గొని యిచ్చఁ జరించెడిముచ్చుగొంట్లు నా
వచ్చధనాంగనాతతి నెవండును నమ్మఁగఁ జెల్ల దెన్నఁడున్.

గీ. నమ్మఁ జెల్లదు సొన్నారినమ్మకంబు
వారవనితలవలపును, వసుధలోన;
రెంటఁగను కట్టుఁదనమును గొంటుఁదనము
నంటి యుండును గావున నఖిలజనులు.

గీ. ఎపుడుఁ బైచేష్టలను బట్టి యెంచరాదు
వలపు గల దంచు వారకాంతలకు నెల్లఁ;
గనుల కెఱ్ఱగబుఱ్ఱగఁ గానిపించు
మోదుగులచెంతఁ గలదె యామోద మింత.

ఉ. లాలనఁ జేసి నైజకృతలక్షణయుక్తిని నల్లఁ జేరి, తాం
బూలము లిచ్చి పాదములపొంతకుఁ జేరి సమర్చనావిధిన్
దేలిచి పూరుషోత్తములఁ దృప్తులఁ జేయఁగ లేదె యంత్రపాం
చాలక; యంతకంటె వెలచానసుడుల్ పచరించు నింతియే.

మఱియును.

ఉ. తేనియ లొలుకఁ బలుకఁగలను దియ్యగఁ జెప్పి జనాళి నెల్లచోఁ
దా ననువొందఁ జేర్చికొని తాటను బూటనుఁ జేసి ద్రవ్య మెం
తేని గడించి పేరుకొనదే, మెరమెచ్చు లన్యాయవాదిచం
దాన ధనాంగనామణిమనంబును నెవ్వరి కీయకుండఁగన్.

గీ. మనము లేని దయ్యు మంచిగందపుబొమ్మ
తనదులోన వెలుపలను వలపును
దవరఁ గాంచి జనులఁ దనియించుఁ గాని, రో
వెలఁది కొయ్య కట్టి వలపు గలదె.

ఒకరియధీనమం దున్న ట్లుండి, వే ఱొకరి కైనను సన్నలు చేయుచు,
నింకొకరితోఁ బొందుట కియ్యకొని, షు ఱొక్కనికడ డబ్బుదస్కం

బులు నిజచేష్టాచమత్కారంబులం దీయుచుఁ, దుదకు నెల్లర మోసపుచ్చి మోసంబునకుఁ బుట్టినిం డ్లనం జను. శోవెలందుల నెఱింగియు వారి వలలం జిక్కుటకంటెను దెలివిహీనత కలదా?

చతు—దేవా! నీవక్కాణించినయంశంబు లన్నియు వారవధూమణులవర్త నంబు లనియే యొప్పుకొనియెద. ఈ మాలలితాంగి మాత్ర మాతీరు కక్కరితి కలది కాక వేశ్యాజనవిడంబనంబులు విడచి పుచ్చి, అట్టి హీనకృత్యంబుల నెల్ల రోసి, లోకంబునఁ గులరూపయౌవనవిద్యా విలాసుం డగు నొక్కచక్కనిపూరుషవర్యుండు లభించినం గాని వల చుట లే దనియు, నంతదనుక బ్రహ్మచర్యంబునఁ బ్రవర్తింతు ననియుఁ బ్రతిన వట్టి యున్నది. నేటికిఁ దనయదృష్టవశంబునఁ దల్లక్షణాభి రాముండ వగునిన్నుం బొడగాంచి వలచి యీతీగున నన్నుం బుత్తెంచె. అదియునుం గాక యిట్టిసదమలప్రవర్తనఁ గలపంకేరుహలోచన తనంతఁ దా వలచి వచ్చుట బహుతపఃఫలపుణ్యంబునఁ గాని పొసంగనేరదు. కాళ్లకడకు వచ్చినకాంత నొల్లక జెలవైఖరి యూరక యీతీరువఁ దిరస్కరించుపూరుషుని నెందును గాన.

మనో—(తనలో) ఇంక దీనితో నెక్కుడుప్రసంగంబుఁ జేయరాదు. అయిన నిట్లు పలుకువాఁడ. (ప్రకాశముగా)

చ. పని గొనివచ్చి యున్న ననువంటివిదేశుని నవ్యసక్తచి
త్తుని నొనరింపఁ బాడియె? వధూటిరో! యంతియ కాక విత్తకాం
తను ముద మొందఁ జేయుటకు దగ్గర విత్తము లేదు, మీకు నో
పినగతిఁ బచ్చిపైకమును వెచ్చ మొనర్పఁగఁ జాలఁ బొమ్మికన్.

చతు—స్వామీ! మాచెలి మ ల్లొండుతలంపుతో మిమ్ము వలచుట లేదు. మీయనుగ్రహసంపాదనంబున మారవికారంబు దూరంబుఁ జేసికొని పెక్కుసౌఖ్యంబులు మీతోఁ గలసి మెలసి యనుభవింపవలయు ననియే మా నెచ్చెలియచ్చంపుఁగోరిక.

మనో—అట్లని నీవు ప్రమాణము చేయఁ గలవా?

చతు—అబద్ధంబులకుఁ బ్రమాణంబులు గాని నిజంబున కేల?

మనో—

చ. అటు లన నేల? తొల్లి నిటు లాడి ననుఁ వ్రతహీనుఁ జేసి, పి
మ్మట ధనవంతు నొక్కరుని మచ్చిగఁ జేకొని తల్లిఁ జేరినన్.
దటుకున నిల్లుఁ బాపిన నొనర్చ్చినదే నపు డెద్ది? యట్టులే
నటమటఁ బొందఁ జాల మగువా! నను నల్లట పెట్ట కేగుమీ.

చతు—అచ్చ మైనవలపు గలకాంత లెన్నఁడు నట్లు చేయ రని మీకు నేఁ జెప్పవలెనా?

మనో—(తనలో) అది నిజమే. (ప్రకాశముగా) చతురికా!

ఉ. ఇంతకుఁ గాదు కూడ దని యీవు వచించెడిపక్షమందు మీ
యింతిసమక్షముఁ గదియ నేగి సమస్తముఁ దెల్పి “యిట్టులే
నింతటిపాపకృత్యమున కెన్నఁడుఁ బాల్పడ” నంచు ముందు నా
చెంతను నామె చేఁ బ్రతినఁ జేయఁగఁ జేయుము దీని కొప్పెదన్.

చతు—దేవా! నేఁ బోయి తాము సెల విచ్చినయంశంబులు మాచెలికిం దెల్పెదాన. సెల వొసంగుఁడు.

మనో—మంచిది. పోయి రమ్ము.

చతు—(తనలో) ఈతండు తప్పక యికార్యంబున కొడంబడినవాఁడే. కానిచో నాతోడ నిట్లేల పలుకు? నే నేగి యీవృత్తాంతంబు నా చెలికిం దెల్పి యామె నిట కనిపెద. కదపినచో ముగ్గినపండు మచిగ నుండి వీడి చేతఁ బడ కుండునా? నే నింక ధన్యురాల నగుదు. (అని నిష్క్రమించు చున్నది.)

మనో—ఈసారి నాకోరిక తప్పక నెరవేరినది. ఆపాదుగనదుం డిఁక న న్నేమి చేయఁ గలఁడో చూతము! ఈచతురిక పోయి నావచనంబుల నారాగమంజరికడఁ బూసగ్రుచ్చినరీతిం జెప్పి యామెను దప్పక యిక్కడి

కనుపును. రాగమంజరియే యిచ్చటికి వచ్చి నన్ను వేఁడికొన్న నాయం దాలలితాంగికి మిక్కుటమగు వలపు కల దని తేటపడఁ గలదు. దాన నాకు శ్రేయస్కరంబె కాక ప్రతిజ్ఞాపరిపాలనశక్తియుతుండ నై లోకంబున వన్నెవాసియుం గనువాఁడ. ఈసారి యాధనదుండు వచ్చిన గాని నాకౌఁగిట నున్నంతకాల మాకాంతమనంబుఁ ద్రిప్పఁ జాలఁడు. ఇఁక వీఁ డేమి చేయునో చూతము. (చప్పుడు విని వెనుకకుఁ దిరిగి) కామపాలా!

[కామపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కామ—(తనలో) ఈయనముఖవైఖరి చూడ నేమియో క్రొత్తగాఁ గాన్పించుచున్నది. ఇంతకుఁబూర్వము నాతోడ మాటలాడినయాతొత్తు వచ్చి వీని కెద్దియో మదనమంత్ర ముపదేశించి యుండ నోపు. దానియజమానురా లగురాగమంజరి వీని వలచి యుండ నోపు. లేకున్న నిది వని బూని వేఁడుకతో నిటకు వచ్చెద ననియు మాటసాయమ్ము చేయుమనియు నన్నేల యడుగు. ఈపూవులు వీనికిఁ జూపుచు ప్రసంగమున నీసంగతి కనిపెట్టెద.

మనో—కామపాలా! ఇంతసే పేమి చేయుచుంటివి? క్రొత్తరకము పూవులఁ జాలఁ గోసికొని వచ్చితివే? ఏవీ యిటు తెమ్ము? (అని పుచ్చుకొని) ఆహా! ఏమి! వీనిసౌరభ్యసంపద! ఇన్నిజాతులు నీవనంబుననే పెఱుగుచుండెఁ గదా! ఇది యీసారి తప్పక నందనంబును దనయాధిక్యసంపదచే మీఱిన దన వచ్చును.

కామ—దేవా! ఈవనంబున కాచాయగ నున్నకాసారంబున గ్రాలుచున్నయీసహస్రపత్రకమలంబులను జూడుఁడు. ఈజాతిపుష్పంబు లీకొలంకున దక్క భూలోకంబున మఱి యెచ్చటను గానరావు.

మనో—ఆహా! ఏమి వీనిభాసురత.

గీ. తనదు వేయిదళంబులఁ దనరు నీస
రోజరాజంబు రాజిల్లు నోజఁ గంటె
భక్తపరతంత్రుఁ డగురమాభర్త చేతి
వేయియంచుల కైదువువిధము దోఁచు.

కామ—అయ్యా! ఇయ్యది పారిజాతంబు.

మనో—దేవజాతిపుష్పలక్షణంబులు దీనికిం గలవు కాఁబోలును.

కామ—దేవా! అవి యెవ్వి?

మనో— గీ. వాడఁ జెందదు నలఁగదు నాడె మైన
కాంతియును మేలివలపును గలిగి దివ్య
మహిమమును బొంది కోరినమాత్ర సకల
జనులకోర్కుల నెల్ల నొసంగు చుండు.

మఱియు దీనిని ధరించినంతమాత్రమున వాని కధిక తేజంబును నమిత ప్రభావంబును గూడ నొసంగును. (అని దానిం గైకొను చున్నాఁడు.)

కామ—ఆహా! మీముఖవికాసం బెంతవృద్ధియైనది. ఇదివఱకు నాలోచనాధీనంబుగ నున్నట్లు కనిపించుమీమోముదమ్మి కిప్పు డిట్టియధిక వికాసత యీపుష్పరాజంబుచేతనే కాఁబోలు సంఘటిల్లినది.

మనో—క్రొత్త కేమి యున్నది.

కామ—ఏదియో యొకగొప్పకార్యంబు కుదిరినంత యుత్సాహం బిప్పుడు తోఁచు చున్నది.

మనో—కార్య మేరితోడను!

కామ—అందు కే నైన వచ్చి యుండవలయును.

మనో—నా కేమి? రాగమంజరిపరిచారిక యఁట. దాని పేరు చతురిక యఁట ఇంతకుపూర్వమే వచ్చివెళ్లినది.

[రాగమంజరి ప్రవేశించు చున్నది.]

కామ—(ముందునకుఁ జూచి) ఆవచ్చువా రెవ్వరు చెప్పుమా? రాగమంజరియా యేమి?

మనో—(సంతోషముతో) రాగమంజరియేనా ?.

కామ—చిత్తము.

రాగ—నా నెచ్చెలి చెప్పినపల్కులం బట్టి చూడ నామనోహరాకారుండు నన్ననుగ్రహించు ననియే తోఁచు చున్నది. నాకేల తనవచనంబులుగఁ దెల్పు మని చతురికను బుత్తెంచు? ఇంతకు నాభాగ్య మెట్లున్నదో?

మనో—(తనలో)

ఉ. చారువిలోకసత్ప్రభలసర్వముఁ దన్మయ మందఁ జేసి, శృం
గారము మూర్తి నైకొనినకైవడి వచ్చెడియీమనోహరా
కారము మన్మథుండ నని గర్వము నొందెడినామనంబు నే
తేరకుఁ దేర త్రికుక్కలను ద్రిప్పెడులోకము నెట్లు జేయునో.

రాగ—(సమీపించి) దేవా! ఇదె రాగమంజరి ప్రణమిల్లు చున్నది.

మనో—(చిరునవ్వుతో) ఇష్టావాప్తి పొనంగుఁ గాత.

కామ—దేవరతోఁ బ్రయోజన మేమి?

రాగ—(సిగ్గుచేఁ దల వాంచుకొనుచున్నది.)

మనో—(తనలో) అహా! ఏమి దీనిరూపసంపద! త్రిలోకంబులయందు నిట్టిమోహనాకారంబు గలకాంతను గని యుండ. నాకు స్త్రీపురుషు లందఱును గొట్టినపిండి గద. ఈయబల నే నెప్పుడును జూచి యెఱుంగను. కావునఁ జతురిక చెప్పినయ ట్లీమె యింతదనుక నిస్సాగరిష్ఠురాలై యున్న దని చెప్పుట కెంతమాత్రమును సందియము లేదు. ఇట్టికాంత నావశవర్తి యై యున్నచో నింక ధనదుం డేమి చేయఁ గలఁడు? అహా?

ఉ. వాలికచూపులం దళుకువన్నియ మీఱినముద్దుచెక్కుటి
ద్దాలును మోముదామరయుఁ దన్వికి సిగ్గదఁ గూరినప్పుడే
మే లగువింత సోయగము మేకొని నా దగుచిత్తవృత్తి నా
మూలము గాఁగ మోహమున ముంపఁగఁ జొచ్చె ని దేమిచిత్రమో?

రాగ—మనోహరా! భవచ్చిత్తానుసారంబు—

మనో—నాచిత్తం బేల యీవనవిహారంబునకు!

రాగ—కాదు. కాదు. యౌవనవిహారంబునకు.

మనో—నీవు వారకాంతవే కదా! ఇప్పుడు క్రొత్తగ మాచిత్త మేల?

రాగ—నేను మీకుఁ గాంతనుగానే కానిపించుచున్నపక్షమున నాదరింపకుండు టెట్లు?

మనో—ఓహో! ఆదరించుట యేమి? ఇవి యేటిపలుకులు?

రాగ—(తనలో నివ్వెరతో) నాచెలి వీనితో మాట్లాడనే లేదా యేమి? లేకున్న నట్లేల చెప్పు? అట్లు కాదు. వనిత తనంతఁ దా వలచి వచ్చిన మగవా రెన్నిబింకంబులో సాగింతురు. అవసరంబు నతిక్రమింపఁ జాలము కదా! (ప్రకాశముగా) మాచతురికతోఁ దా మేమియు సెలవీయ లేదా?

మనో—ఓహో! అదియా! (తల యూచి) ఇంతులను మాత్ర మెన్నటికిని నమ్మరాదు. అందును నీవు వారకాంతవు.

రాగ—దేవా! నేను చేసినపాప మేమి యున్నది? నామాట నమ్మకుండుటకు?

మనో—మాట లోకచోటను మన సొకచోటను. ఇంతకంటెఁ బాపమెద్ది?

రాగ—దేవర యింతలో నామనం బేమి కనిపెట్టి యిట్టిమాట లంటిరి? నిక్కముగ నామన సెట్లుండునో నామాటలు నట్లుండు.

మనో—ఆ. కార్యావసరంబును బట్టి మాట లనేకంబుఁ జెప్ప వచ్చు.

చ. కొదుకక తేనెమాట లొకకొన్ని నిజావసరంబుఁ బట్టి యొ
ప్పిదముగఁ జెప్పి కోర్కె నెరవేరినపిమ్మట నాత్మశక్తిఁ జూ
పుదురు సఖీజనంబు లెటు పోలును వారిని నమ్మ; నెందుఁ జె
ప్పఁ దగదు చూచు చుండఁ దడిపాతనె కుత్తుకఁ గోయ నెంచెదర్.

అట్టివారిని నమ్మి చెడిపోయినవా రెందఱు లోకంబున? ఎఱిఁగి యెఱిఁగి నే నెట్లు నీమాటలు నమ్ముదును? అందున నీవు వారకాంతవు. ఇంక వారకాంతలవర్తనంబులు చెప్పవలయునా?

రాగ—మనోహరా! మన్మథాస్త్రపరిపీడిత నగునామాటఁ బెడచెవిం బెట్టక నాప్రాణంబులు కాపాడిన పుణ్యంబుఁ గట్టికొనుము.

మనో—(గర్వముతో) మన్మథుం డెవ్వఁడు?

రాగ—నాకు మన్మథుండవు నీవె కాని మ ఱెవ్వరు?

మనో—నేను మన్మథుండ నె ట్లగుదును?

రాగ—లోకంబున బూబోఁడులు తాము వలచినవానినే మన్మథుఁ డని యెంచికొందురు. నేను ని న్నిప్పట్టున వలచితిని గాన నీవు నాకు మన్మథుండవే యగుదువు.

మనో—చెలీ? నేను నీకు మదనుండనే నైనచో నాకు నీవి రతివి కావలదా?

రాగ—నీవు మన్మథుండ నైనఁ గా వచ్చును గాని నేను రతి నెట్లగుదును? నేను రతిని గాను. నా పేరు రాగమంజరి. అయిన మీమన సెటు లుండిన నేనటు లగుదు.

మనో—నీ వెవ్వరిరాగమంజరివి?

రాగ—నే నేరిరాగమంజరి నగుదునో యించుక తాళిన నాగ్రుచ్చెద.

మనో—ఈచాతుర్యముల కేమి లే.

రాగ—నిక్కము వక్కాణించిన చాతుర్యం బె ట్లగు? తాము నాగుట్టు మట్టు బయలు వెట్టఁ దలఁచి యిటు లనుచుంటిరి. వేయుమాట లేల దేవర నన్నుఁ బరిగ్రహింపక యిఁక నొకనిమిష మిటు లాలసించిన స్త్రీహత్యామహాపాతకంబు తప్పక మిమ్ముం జుట్టఁ బెట్టుకొనును. తరువాత నే మనుకొన్న నేమిప్రయోజనము?

మనో—(తనలో) ఓహో! కార్యంబు మించఁ బెట్టరాదు. దారిలోనికి దెచ్చి నన్ను వీడకుండిన ట్లీమెచే బాస చేయించుకొన్నచో నుచ్చులు బిగియించినయడుతవలె మనమాట జవదాట కుండును. క్రమముగ ధోరణిలోనికి దింపుదము. (ప్రకాశముగా) చెలీ! మే మొక్కచోట నుండెడివారము కాము. దేశములన్నియుఁ దిరుగుచుందుము. అట్టియెడ

నిన్నుఁ గనిపెట్టుకొని యుండ మాకు పొసంగదు. పరదేసు లేడ? కాంతాప్రసంగము లేడ? ఈసంగతి నీకుమాత్రము తెలియదా యేమి?

రాగ—మనోహరా! మీకు నాయెడఁ గరుణ యున్నచోఁ బరదేశము లేల? ఊరక నన్నిటు లాడించుటకుఁ బలుకుచుంటిరే గాని మీకటాక్షవీక్షణంబులు నాయెడ నేల ప్రసరింప కుండు?

మనో—అయ్యో! నీవు వారకాంతవు గదా! నిన్ను సంతసింపఁ జేయుటకు నాకడ ద్రవ్య మెక్కడిది?

రాగ—నేను జన్మ మెత్తినది వేశ్యజాతియం దైనను దత్ప్రవర్తనంబులు మాత్రము నాకనిష్టంబు లగుటచే. నాయెడ మీ రిట్టిసందియంబును బొంద నవసరము లేదు.

మనో—నీమాట యెటుండినను,

చ. మునుపుగఁ బల్కు మెత్తఁదనముల్ గనిపింపఁగఁ జేసి కోడెకాం
ద్రను వలపించి మించినమిటారితనంబున వారివిత్త మె
ల్లను గొని యాత్మ మాతలఁ జలంబు మెయిం బురికొల్పి తోన వా
రిని వెడలించు వేశ్యల నెఱింగియు నే నెటు మోసపోవుదుల్.

రాగ—మనోహరా! నే నట్టిప్రవర్తన కలదానను గా నని యిప్పుడు మాటలఁ జెప్పిన నేమిప్రయోజనము? ముందుముందు మీరే తెలిసికొందురు గాక.

మనో—కాంతా! నీ విట్లు మాటలు మాత్రము చెప్పి తుట్టతుదకు ధనవంతుం డెట్టి డైన విచ్చేసిన వాని నాసించి యప్పుడు నన్ను వెడలంద్రోచిన నే నేమి చేయువాఁడను? కావున నే నట్టు లెన్నఁడును జేయ ననియు, మీయనుజ్ఞ లేనిదే నేను మిమ్ము వీడి యుండ ననియు, నాకు బాస యిచ్చిన నే నిందు కొడంబడువాఁడ.

రాగ—ప్రాణనాయకా! మీ కిట్టివెట్టిసంశయం బేల? ధనదుండ వచ్చి నన్ను వేఁడికొన్నను మీకౌఁగిలి వీడిపోవుదానను గాను. ఇది ముమ్మాటి

కిని త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. ఇంక నే నాలసించుటకు సాహ సింపఁ జాల? ఒక్కసారి నీబిగికౌఁగిలింత యిమ్ము. (అని కౌఁగిలించు కొను చున్నది.)

మనో—(స్పర్శసుఖము నభినయించుచు) మనోహారిణీ! ఇటు గూర్చుండుము. (కామపాలునివంకఁ దిరిగి) కామపాలా? సాయంకాలకృత్యంబులకుఁ దగినయుపకరణంబులు సిద్ధముగ నుంపుము; మేము నిదె వచ్చుచున్నాము.

కామ—(తనలో) ఆ. ఇఁక సాయంకాలకృత్యములే! (ప్రకాశముగా) చిత్తము. (అని నిష్క్రమించు చున్నాఁడు.)

రాగ—ప్రాణేశ్వరా! సూర్యాస్తమయసమయము కాఁబోవు చున్నది. మనము మాగృహంబునకుఁ బోయి సుఖం బుండుదము రండు.

మనో—తరుణీ! చూడు!

చ. కలకలరావముల్ సెలఁగఁగా ఖగజాలము గూండ్లు చేరెడిన్;
దల మనుప్రేమచేఁ గదుపుతండముఁ జేరఁగ నావు లెల్ల నిం
డుల వెంగ నూచుఁ బర్విడెడు డొంకలు దాఁటుచు, నాగునట్టి పై
దలఁ దల మీఱి; చేరుకొనెఁ దామరసాప్తుఁడు పశ్చిమాద్రికిన్.

కావున మన మీదరి నున్నకొలనుకెలని కేగి కాల్యంబులం దీర్చికొని పిదప నీచెప్పినచొప్పునఁ బోదము. పద.

(అని నిష్క్రమించు చున్నారు.)

ఇది తృతీయాంకము.

# ధ నా భి రా మ ము.

## చ తు ర్థాం క ము.

[కనకలత ప్రవేశించు చున్నది.]

ఆహాహా! ఈసంకల్పసిద్ధునిమహిమ మే మని కొనియాడఁ గలను? నా సఖి యగుమనోరమతోఁ బొత్తొనర్చి కొన్నిదినములే యైనను, ఆమె దేహమును గేహమును, బరిచారికాసమూహమును గూడ సువర్ణమయముగా నొనరించె గదా! నాబోటి దెన్నినాళ్లిట్టిపరిచర్య లొరుల కొనర్చిన నింతటిఘనవిభూషణంబులు గడియించుకొనఁ జాలును. ఆఁడువాండ్రకు నగలయం దధికప్రీతి కదా! అది యీసంకల్పసిద్ధుం డెఱింగియే, యపార మగువిభూషణాదుల వనునిమిషంబును నెల్లరకు నొసంగు చున్నవాఁడు. ఈతనిచర్య యంతయుఁ జూడఁ జూడఁ గారణజన్మగాఁ దోఁచు చున్నది. లేనియెడల నిట్టియైశ్వర్య మేల కలుగును? ఈతండు కుబేరుం డనియె చెప్ప నొప్పును. కుబేరున కీదాతృత్వ మెక్కడిది? వీనిని దాతృత్వ మలవడినకుబేరుం డనిన బాగుండును. ఈదాతృత్వగుణంబువలననే యీతనికి జనవశీకరణశక్తి కలిగినది. "ధనమూల మిదం జగ" త్తను నార్యోక్తి వట్టి దగునా? ఈతండు తలంచినప్రతికార్యము నప్రతిహతంబుగఁ గొనసాగు చున్నది. అధికప్రజ్ఞాసంపన్నుఁడు.

గీ. ధనము గలవానికిని ధీయుతునకు నెప్పు
డవని సాధింప రానికార్యంబు లున్నె;
కోరునది తృటిలోనఁ జేకూఱు చుంట
నితఁడు సంకల్పసిద్ధాఖ్య నెసఁగె నౌర.

వీనికిరాగమంజరియుం దాస వోడమినని. ఇది నానెచ్చెలికిఁ గేవలము వ్యతిరేక మైన దగుట రహస్యముగ ననుసంధింప వలయును. నాకుఁ గలధనాశచే నాయజమానురాలి కప్రియమే యొనరించు చుంటిని. అయినను,

ఉ. చిన్నటనాఁటనుండియును సేవ యొనర్చుచు నుంటిఁ గాని నా
కెన్నఁడు నిట్టిభూషణము లిచ్చియెఱుంగదు ; మోడి నైన నే
నెన్నఁటి కింక సొత్తు గడియించుట ; నాకు నిమేషమాత్రలో
నిన్ని లభించె భూషణము లీతని యాజ్ఞ యొనర్చు టొప్పదే.

అందునను నేను వెలయాలిసేవకురాలను గదా! నే నిట్టిప్రవర్తన మొనర్చినఁ దప్పేమి? ఇది నాకుచితమే యగును. శుష్కప్రియంబుల వలనఁ గడుపు నిండునా? ముక్కునకు సూటిగఁ బోయిన నీదినములలో మనమొగముఁ జూచువా రెవ్వరు? ఏదియో యొకవిధముగ నెరులను సంతోషపెట్టి ద్రవ్యము సంపాదించుట కర్తవ్యము. ఇట్లొనరించిన దొంగతనము కాదు కద! ఎందునను శ్రమపడినఁ గాని యొకతృణము దొరక నేరదు. ఇంతకును మాయాప్రయత్నమున రాగమంజరి యీతనికే చిక్కన దనుకొనరాదు. ఇట్టికార్యంబులకుఁ గొన్ని మాయోపాయంబులును, వక్రగతులును గలిగి యుండినఁగాని యివి నెరవేర నేరవు. ఇది లోకంబున కంతకును గలదు. అయ్యో! వృధాలోచనములచేఁ గార్యము మఱచు చుంటిని. "నీ విప్పుడు రాగమంజరితల్లి యగుకుటిలాలకయొద్దకుఁ బోయి సంకల్పసిద్ధుండు సకలాభరణములతోఁ గొంచెము సేపటిలో మీగృహమునకు వచ్చును. అందుకుఁ దగినరీతిని. బూర్వాలోచన కనుగుణముగఁ బ్రవర్తింప వలయునుసుమా" అని చెప్పవలయు ననిగదా నాకు సంకల్పసిద్ధుం డనుజ్ఞ యిచ్చి యున్నాఁడు. నేఁ బోయి కుటిలాలకతో నీసంగతులు రహస్యముగ ముచ్చటించి వేగమ రావలయును. ఆలసించిన మామనోరమ యనుమానపడును. (అని రెం డడుగులు నడచి) ఎవ రావచ్చునది? నే ననుకొనినమాటలు విన లేదు గద!

[అప్పుడు చతురిక ప్రవేశించు చున్నది.]

చతు—తల్లిమాటలను బాటింపక తుద కింతకు వచ్చినది మా కేమి పెట్టును దా నేమి తినును? ఆమహావైభవం బంతయును నే మై పోయెనో? కూర్చుండి తినినఁ గొండలును నాట వనుసామెత నిజ మయ్యెను. ఈ రాగమంజరి యిట్టిస్థితికి వచ్చినను, దానికి మూలకారణుం డైనమనోహరుని విడువ నొల్లదు. అభిమాన మన నిది కదా! అయ్యో! తిండి లేక పోయిన నీవృథాభిమానములతో నేమి ప్రయోజనము? (అని కొంచెము నడచి) ఓహో! కనకలతా! ఎక్కడి కిట్లేగు చుంటివి?

కన—(తనలో) ఇది రాగమంజరికి నచ్చినబంటు. నే నేమని చెప్పెను? అయిన నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) మాగృహమున నీదినమున గజ్జెలపూజ యొనరించెదరు. ఆమహోత్సవమునకు మనవాండ్రను నలుగురను బిలుచుటకై బయలు దేఱితిని.

చతు—అవును. మీయింట నిఁకఁ బూజలమీఁద నే పూజలు. ఆసంకల్ప సిద్ధునిపుణ్యమా యని మీ రెన్నిమహోత్సవము లైన నొనరింప వచ్చును. మీ కేమి?

కన—మీకు మాత్ర మేమి? రూపజితమన్మథుం డగుమనోహరుం డింట నున్న వాఁడు కదా! ఆఁడుదానికిఁ దాను గోరినవానితోఁ గలసి సుఖించుట కంటె నేమి కావలెను.

చతు—అది నిజమే కాని ధనము లేనివట్టివలపులతో నేమి ప్రయోజనము? అదియుండినఁ గదా యెన్నియాట లైన నాడుట!

కన—అ దేమి యట్లను చుంటివి? ఇక్కడ రాగమంజరి మిగుల ధనవంతురా లనిగదా వాడుక!

చతు—అది యిప్పుడు తాటుమా కైనది. మనోరమ యనుము.

కన—ఆమె సొమ్మెల్లామె హరించివదా యట్లు పలుకు చుంటివి?

చతు—కాదు. కాదు. ధనవంతురా లనునామెవాడుక యీమెకు వచ్చిన దని య ట్లంటిని.

కన—ఇప్పుడు రాగమంజరియొద్ద నేమియు ద్రవ్యము లేనే లేదా?

చతు—అది యుండిన మా కీ హైన్య మేల? దాని కేమి? కనకలతా! నీ వీవిభూషణము లన్నియు నెక్కడ సంపాదించితివి?

కన—నే నేమి దొంగిలించుకొని వచ్చితి ననుకొంటివా యేమి?

చతు—అట్లు కాదు. ఎవ రిచ్చి రని నాయభిప్రాయము.

కన—ఎవ రని వేఱె చెప్ప వలయునా? మాకుఁ గల్పవృక్షముగా నొప్పుచున్న "సంకల్పసిద్ధుఁడు"—ఆహాహా! ఆతనినామము దలంచికొనిన నెట్టినిర్భాగ్యులకును గూడ నింతకూడు దొరకునుసుమా!

చతు—అవు నట్లే వినియున్నాను. అట్టిమహాత్ముని జెట్టఁబట్ట మామనోరమ యేమి పుణ్యము చేసికొన్నదో కదా!

కన—చతురికా! నిజముగా నాతఁడు మహాత్ముఁడే. కానియెడల వాతఁడు పట్టినది బంగారమును ముట్టినది ముత్యము నెట్లగును?

చతు—ఈదినములలో మా రాగమంజరివంటి యమాయకురాలి కేమి గాని, కొంచెము మాయోపాయములు నేర్చుకొనినవారందఱునుగూడ నాతనికిఁ బరిచర్య చేసి తలయొకమూటయు సంపాదించి రని విని యున్నాను.

కన—అది నిజమే యాతనిదాతృత్వ మట్టిదియే.

చతు—కనకలతా! ఏదీ యిటు రమ్ము. నీభూషణంబుల నొక్కసారి చూడనిమ్ము. నాకు మాఁసుచ్చటగా నున్నది. (అని పరికించుచు)

ఉ. రాగిడి చంద్రవంకయుఁ గరం బలరారెడిసూర్యచంద్రులుఁ
బా గగుచేరుచుక్కయును బన్నసరంబును బావిలీలు మేల్
నాగసరంబు ముక్కరయు నత్తును గాసులపేరు కంటెయున్
సోగగ నున్నకీల్జడయుఁ జొప్పడునే వెల యింత కట్టఁగన్.

ఆహా! ఇట్టిభూషణములను ధరియించుట కెంతటిపుణ్యము చేసికొన వలయును. నాబోటినిర్భాగ్యశిరోమణి కివి యెట్లు వచ్చును?

కన—చతురికా! అట్లనుకొనెద వేల? నీవుఁ గూడ ధరించుకొనెడి కాలము వచ్చును లే. విచారింపకుము. ఎల్లకాలమును జీకటిరాత్రులే యుండవు గద! నీ విప్పు డెచ్చటికి బయలుదేరితివి?

చతు—మారాగమంజరి యామనోహరుని నేకనిముస మైన వీడి యుండదు. ఆతఁ డిప్పుడు భీమేశ్వరారాధనకై యాలయమున కేగి యాలసించె నఁట. వానిని దోడ్కొని రమ్మని యామె నన్నుఁ బంపినది. నే నందుల కేగు చుంటిని. నీతో నింకను ముచ్చటించవలె నని నా కభిలాష యున్నది కాని మనకుఁ దీరిక యేది?

కన—తీరిక కేమి లే. రాగమంజరి యిప్పు డొంటరిగ నున్నదా? తల్లి కుటిలాలక యెక్కడ నున్నది?

చతు—తల్లి వాకిటిచావడిలో నున్నది. రాగమంజరి మేడపై నున్నది. ఏమి?

కన—ఏమియు లేదు. మహోత్సవమునకుఁ బిలుచుటకు లే.

చతు—సరియె. నేను పోయి వచ్చెదను. (అని నిష్క్రమించు చున్నది)

కన—మనకు మంచిసమయము దొరకినది. ఈదినమున దేవళమున నేదియో మహోత్సవ మని వినియున్నదానను. ఈదినమున మనోహరుఁ డాలస్యముగ వచ్చును. నేను పోయి కుటిలాలకతో సంకల్పసిద్ధుఁడు చెప్పిన సంగతులు చెప్పి రాగమంజరిబుద్ధి మరలునుపాయముఁ గలిపి వచ్చెదను. ఇంతలో నాసిద్ధుఁడే మేటిధనములతోఁ గుటిలాలకయింటికి వచ్చును. ఇప్పుడు రాగమంజరి ద్రవ్యహీనురాలై యున్నది. కావున నీసంకల్పసిద్ధునివలలోఁ జిక్కక తప్పదు. నే వడివడిగఁ బోయి నా పని నెరవేర్చుకొని రా వలయును. ఇందు సంకల్పసిద్ధునియభిమతం బీడేఱిన నా కనేకలాభంబులు కలుగఁ గలవు. ఇంకను వలయునన్ని

భూషణములను సంపాదించుకొన వచ్చును. కానిమ్ము. ఈమాత్రప్రసంగా దులు ముగియుదనుక మనోహరుండు రాకుండుఁ గాక.

(అని నిష్క్రమించు చున్నది.)

ఇది విష్కంభము.

## చతుర్థాంకము.

రంగము—రాగమంజరీసౌంధాంతరకూటము.

[విచారముతోఁ గుటిలాలక ప్రవేశించు చున్నది.]

కుటి—అయ్యో! మేటివైభవం బంతయు నేటిలోఁ గలసి పోయినదిగదా! ధన మంతయు దంధన మై పోయినది. నాయాశ లన్నియును నిరాశ లైనవి. తుదకుఁ గూటికి గుడ్డకుఁ గూడ మొగమువాచ వలసి వచ్చినది, కడుపితీపిచే నే దీనిని విడువ లేకుంటిని గాని, యిది నే నెంత చెప్పి నను నామాట పాటింప కుండెను. ఈనిర్భాగ్యుండు ప్రవేశించి నాయి ల్లంతయు గుల్ల చేసెను. నాకిప్పు డీతని వెడలఁ గొట్టుటకైనను సావ కాశము లేక యున్నది. నేను పుట్టి బుద్ధి యెఱిఁగినతరువాత నెంద ఱందఱినో సరసులను జూచితిని గాని యిట్టివాని నెందును గాన. మా దౌర్భాగ్యయోగంబున నీతండు తారసించెను. నాచాకచక్యముచేఁ బెక్కుమందివలన వేనవేలు సంపాదించితిని. అది యంతయు నే మై పోయినదో? "నూఱుగొడ్లను దిన్న రాబందున కొక గాలిపె" ట్టన్నట్లు తుదకు నా కీగతి పట్టినది. ఆహాహా! ఆమనోరమభాగ్య మే మని చెప్పను? అదియును మాయమ్మితోడిదే కదా! దానియదృష్ట మది ఎవ్వరికి యదృష్ట మెవ్వరికి వచ్చును? అది మొన్న మొన్న గడనకు మొదలిడెనో లేదో కాని నిక్షేపములు దానియధీనము లైనవి. మహామహు లైనవారు

దాని వాకిటఁ బడి గాపులై పాదసేవ చేయు చున్నారు. ఈమా దౌర్భాగ్యురాలిని నే నే మని తిట్టుదును? పైత్యరోగి జిహ్వకుఁ బంచ దారయుఁ జేదైనట్లు నాహితబోధ మేమియు దీనికి రుచించుట లేదు. నే నెంత చెవి నిల్లు కట్టుకొని పోరినను దుదకు నానోరు నొప్పి యెత్తు చున్నదియే కాని యది యించు కంతయు వినుట లేదు. ఆసంకల్ప సిద్ధునిదయ సంపాదించి యాతనియుపదేశానుసరణముగా మెలంగ నిశ్చ యించుకొంటిని. ఆప్రకారము వాని నాశ్రయించితిని. అందుమూలమున నిప్పుడు కూటికి మొగము వాయ నక్కఱ లేక పోవు చున్నది. ఇదియుఁ గాక నామాటలవిశేషముననో మఱి యేకారణముననో కాని యా సిద్ధునకు మారాగమంజరియం దాస వొడమినది. అది తుదిగా మఱింత ధన మిచ్చుచున్నవాఁడు. రాగమంజరిమనమును ద్రిప్పుటకుఁ గూడఁ గొన్నికొన్ని సదుపాయంబులం జెప్పి యున్నాఁడు. ఆప్రకార మొన ర్చినఁ గొంచెము దారిలోనికి వచ్చునేమో యని మరల నాశ వొడము చున్నది. ఎఱ వైచి పట్టి మచ్చిక చేసినఁ గ్రూరజంతువులే జనులకు స్వాధీన మై వారు చెప్పినవిద్యలు నేర్చు చుండఁగా నిఁక దీనిమాట చెప్ప నేల? ఇఁక నిది యెట్టి బీరములు సాగించిన నేమి? క్రమక్రమ ముగ దారిలోనికి రాక తప్పదు. సంకల్పసిద్ధుని నాశ్రయించినవారికిఁ గార్యసిద్ధి యగుట యేమి వింత. కాని యాదౌర్భాగ్యశిరోమణి మా యమ్మని వీడి పోవు టెట్లు?

మ. చెలితో నీతని వేఱుసేయ కెటు నాచిత్తంబు రంజిల్లెడిన్;
బలిమిం బట్టి గృహంబు వెల్వఱచి చీవాట్లెన్నియో పెట్టి న
వ్వులపా ల్సేయక నాదుకోప మెటు వోవున్; సిద్ధు డేలీల మ
మ్ములఁ గాపాడఁ గడంగు వీని నెటులో పోఁద్రోయ కున్నన్ గటా?

ఇందునకు దగినయోచన యొనర్చి పుత్తెంతు నని సిద్ధుండు నిన్నటిదిన మున నాతో వక్కాణించి యున్నాఁడు. ఆతఁడే యిచ్చటికి విభూవ

ణాదులతోడను వస్త్రాదివివిధవస్తువులతోడను విచ్చేసెనేని తప్పక నా కోమార్తెమనంబునఁ ద్రిప్పఁగందును. (పైవంకఁ జూచిఁ అదిగో! సిద్ధుని యొద్దనుండి కాఁబోలు కనకలత యిట్లే వచ్చు చున్నది.

[అప్పుడు కనకలత ప్రవేశించు చున్నది.]

కన—అమ్మా! కుటిలాలకా! ఇచ్చట నీ వొంటరిగనే కూరుచుంటివా?

కుటి—అవును. నీ వెందుండి వచ్చు చుంటివి?

కన—నేను సిద్ధస్వామియొద్దనుండి.

కుటి—వారియనుజ్ఞ యే మని?

కన—(ఇటు నటు చూచి) మఱి యొకమా రడుగు చుంటిని. ఇక్కడ నెవ్వరును లేరుగద?

కుటి—మ రెవ్వరును లేరు. చెప్పు. చెప్పు.

కన—మ రేమియు లేదు; సంకల్పసిద్ధుఁడు సకలాభరణమ్ములతోఁగొంచెము సేపటిలో మీగృహమునకు వచ్చును. "అందుకుఁ దగినరీతినిబూర్వాలోచన కనుగుణంబుగఁ బ్రవర్తించ వలయును సుమా?" అని నీతోఁ జెప్పు మనియెను.

కుటి—(సంతోషముతో) కనకలతా! ఇది తగినయదను గాన నీవు శీఘ్రముగఁ బోయి యట్లే సిద్ధముగ నున్నా నని వారికిఁ జెప్పి పుత్తెంచుము.

కన—(దగ్గరఁ జేరి) ఇంక నొక్కటిఁ జెప్ప మఱచితిని. (అని చెవిలో నేమియో చెప్పు చున్నది.)

కుటి—అట్లే.

కన—ఇది యనుకూలమే. కానియెడల నిన్నియు నింత వీలుగా సమకూడవు.

(తెఱలో)

గీ. "ధనము వోయి బీదతనము వచ్చినఁగాని
సరకు సేయ నింత స్వాంతమందు

నామనోహరుండు నను వీడి తడసిన
నిలువ నోప నెుక్క నిమిష మైన."

కన—(ఆలించి) అదిగో నీకూతు రిట్లే వచ్చు చున్నది. ఆమె నన్నుఁ జూచిన మోసం బగును. కావున నే నరిగెదను. (అని నిష్క్రమించు చున్నది.)

[అంత "ధనము వీడి" అను పద్యమును జదువుచు
రాగమంజరి ప్రవేశించు చున్నది]

రాగ—ఏమి చెపుమా! నేఁడు భీమేశ్వరారాధనమునకై యాలయమున కేగి యింత తడ వాలసించెను? అది తెలిసికొని ర మ్మని చతురిక నంపి యే యుంటిని. ఈపాటి కది సమస్తమును దెలిసికొని వచ్చుచునే యుండును. నిన్నటిదినము నీతఁడు దేవళమున నుండ మనోరమ యాతనిపైఁ గన్నువైచినట్లు చూచాయగ వినియున్నదానను. దేవళమున కేగుటయు దానియింటిచెంతనుండియే. అందుచేత నా కింతగా నలజడి కలుగు చున్నది. ఈతఁడు మనోమలినము లేనివాఁడే యైనను, అది మిగుల జిత్తులమారి; మెలఁకువఁ గలిగి మెలఁగినఁ గాని మోసంబు వాటిల్లు. ఈ దినమున నా కేమియుఁ దోఁప కున్నది. నామనోహరుండు వచ్చునం దాక మాయమ్మకడఁ గూర్చుండి కాలక్షేప మొనర్చెదను. (అని యట్లు చేయు చున్నది.)

కుటి—(దగ్గరకుఁ జేరఁ దీసి) బిడ్డా! నేఁ డిదేమి చిన్నవోయి కూరు చుంటివి? నీమనోహరుండు నీయెడ నేమియు నపచారము చేయ లేదు గదా!

రాగ—(సంశయముతో) లేదు. ఈక్షణమున నే నాతని వీడి యుండుటయే యుందునకుఁ గారణము.

కుటి—వీడి యుండినమాత్రమునకే యింత విరహమా? మనలో నిట్టివిరహ ములును వలపులు నుండిన నెట్లు సాగి వచ్చును? మాకాలమున నిట్టి విరహములును గిరహములును మే మెఱుఁగుదుమా? మనలో లేని

యాచారములు పట్టుపడిన వేల? ఇందువలన నీవు కులమునకు లేనిపోని కళంకమును దెచ్చిపెట్టు చున్నావు.

రాగ—అదేమి యట్లను చుంటివి? నాప్రవర్తనమున నీకులమునకుఁ గళంకమే సంభవించినదా?

కుటి—ఆఁ హాఁ.

రాగ—ఎందువలన?

కుటి—ఎందువలన నని యడుగ వలయునా? మన కులాచారధర్మములు బాగుగ గుర్తెఱిఁగిన నీ వట్టు లనియుండవు.

రాగ—మనకుఁ గులధర్మ మొకటి కలదా? అందున నేను తప్పు చేయు చుంటినా?

కుటి—చేయ కేమి?

రాగ—అది యేది?

కుటి— క. వెలయాలికి నెక్కడనిసే
వలచి తగిలి యుండుటయును, వలసినవిత్తం
బుల సేకరింప కుంటయుఁ
గులధర్మవిరోధ మండ్రు గురుజను లువిదా.

ఈరెండుగుణంబులును నీయొద్ద నున్నవి; కావున నీవుకులధర్మవిరుద్ధంబగుకార్యం బొనర్చు చున్నదాన వైతివి. ఇది తప్పు.

రాగ—

ఉ. వారవధూటి కాదె దివి వాసము చేయుచు నున్నరంభ, యా
నారి కుబేరసూనునిమనంబునఁ గోరి వరించి భోగధీ
స్ఫారతి వాని వీడక సుఖంబుల నొందుట లేదె, దాని కే
నేరము కల్గె, నద్ది కులనింద్యమె, చెప్పకు మమ్మ! యీక్రియన్.

కుటి—ఎక్క[illegible] స్వర్గములో వాసము చేయు చున్నరంభను నుదాహరణముగాఁ దీసికొను చుంటివో? సురకాంతలకును నరకాంతలకును

బోలికె కలదా? పోనిమ్ము. నీవలె నామె నిర్భాగ్యునిఁ గాక ధనపతి
యైనకుబేరసూనునే వరించెఁ గదా! అట్టిదాని కింక ద్రవ్యమున కేమి
కొదువ? అది కులనింద్య మెట్లగును? నీప్రవర్తన మట్టి దైనదా?

రాగ—అది పోనిమ్ము. మనకులమునఁ బుట్టిననారీమణు లెంద ఱెందఱు
తమవలచినవారికై తమతమమానప్రాణంబులను గూడ ధార వోసి రని
మనము పురాణములఁ జదువుట లేదు?

కుటి—అపుక్కిటిపురాణములమాట యిప్పు డేల? ఇప్పటికాలమున మన
మెఱిఁగి యున్నవారిలో నేరి నైన నట్టివారి నొక్కరిని వ్రేలు మడచి
చూపుము. నీ వట్లు చూపలే వని నేను నిశ్చయముగఁ జెప్పఁగలను ఇట్టి
పిచ్చియూహలచేత నే,

ఆ. వె. పుట్టి బుద్ధి యెఱిఁగి పోకయుఁ గూడ సం
పాదనంబు సేయుపాపమునకుఁ
బోవ నైతివెట్లు బుజ్జగించినఁ గాని,
తనయ! యెట్టు లింక వనరుదాన.

నాపాప మి ట్లుండ ని న్ననఁ బనే మున్నది? ఆహ్హాహా! ఈవాడఁ గలనీ
తోడిచేడియలం దలంచిన నాకు ముచ్చటగు చున్నదే. చూడు

సీ. నీతోడిదే కదా శీతాంశుముఖిదాని
యొడ లెల్ల బంగారుతొడవు లయ్యె
నీయీడునదె కదా నీలవేణి పురాన
నేడఁజూచిన దాని మేడ లయ్యె
నీవంటిదే కదా నెలఁత మనోరమ
నిక్షేపములు దాని నెలవు లయ్యె
నీకంటెఁ జిన్నది గా కున్నె మణిమాల
మడిమాన్యములు దానిగడన లయ్యె

గీ. ఈడు వచ్చిన దాదిగ నీవు వట్టి
బేలుఁదనమునఁ గాలంబు వెళ్లఁ బుచ్చి
తుదకు నిర్భాగ్యు నొకఁని వెదకికొంటి
వింక ని న్నేమ నందునో పంకజాక్షి.

రాగ—అమ్మా! నీ కీ వెఱ్ఱి యేల? ఎవ్వరియోగంబు లెవ్వరికి వచ్చును?

కుటి—బిడ్డా!

మ. ఒకనిర్భాగ్యుని జెట్టఁ బట్టి యిది యయ్యో మేలు గా దన్న నా
రక వేదాంతము చెప్పఁ జూచెదవు మేర ల్మీఱి యిట్లాడఁగా
నకటా? కూడు నె, కూడు గుడ్డ కలవా రై యుండినన్ గాదె పా
యక భోగంబుల నొందుటల్ తలఁప నాయర్థంబు ని న్నేమనన్

చిన్ననాటనుండి నేను కష్టపడి సంపాదించిన సర్వస్వమ్మును వమ్మొనర్చితివి గదా? సమస్తభోగంబులును ధనము మూలము. అట్టిధనము లేనిచో భోగసుఖము లెక్కడనుండి వచ్చును? వినుచుంటివా?

రాగ—విన కేమి?

ఆ. వె. భోగములకు ధనము మూలంబ టంచు నా
యుల్లమందు నెఱిఁగి యుంటిఁ గాని
మోహనాంగు నామనోహరు దానికై
వెతలఁ బెట్టి విడువ మతిఁ దలంప.

కుటి—ఔను నీ వట్లు చెప్పక మ ఱే మందువు? నేను చిన్ననాటనుండియుఁ గష్టించి సంపాదించి దాఁచి పెట్టినధన మంతయుఁ జిల్లిగవ్వయుఁ గాకుండ వాతనితోఁ గూడి వెచ్చించితివి. నీమొదటిస్థితికిని నిప్పటియవస్థకును గలభేద మించుక తలంచినచోఁ సమస్తంబును నీకే గోచరించును. ఇట్లుండియు ధనసంపాదనమునకు మన సేల పోవుట లేదు? ఇప్పటికిని నే మాయలు వన్నిన నేమి నేను ధన మార్జించి యిచ్చినఁ గాని గృహకృత్యము వెళ్లుట లేదు. నీ వేమో పెద్దదాన వై, యిల్లు దిద్దికొనుచు న న్నెంతో

సౌఖ్య పెట్టుదు వని పుట్టెడాసతో నున్న నాకట్టియదృష్టము పట్టినది కాదు. ఇంతకును నేను కష్టజీవిని. ని న్నే మనను.

రాగ—అమ్మా! న న్నేమి చేయు మనెదవు? మనోహరునిసౌందర్యవిశేష ములం జిక్కి నామనం బేమి చేయుటకును దోఁచ కున్నది.

ఉ. అమ్మ! మదాత్మ నీవఱకె యమ్మినదానను వానిరూపవి
త్తమ్మున కంతకంటె మఱి ద్రవ్యము నెల్ల సమస్తభోగభా
గ్యమ్ములు నామనోహరునికాఁగిలి యుండిన నుండినట్టులే
సమ్మతి గల్గి యుంటి నిఁకఁ జాలును నెం డనఁ బోకు మీయెడన్.

ఇది గాక పాపహేతు వైనకుటిలవర్తనముల నేఁ జరింప నోప.

కుటి—తల్లీ! ఇంక నే నేమి చెప్పుదును! మనకులాచారవర్తనములె నీకుఁ బాపహేతువు లైనవి. పాప మన నెట్టిదియో, ఏరీతిని బ్రవర్తించిన నట్టి పాపము సంభవించునో నీకుఁ దెలిసియే యున్నపక్షమున నాచేత నింతగాఁ జెప్పించుకొనవు. మనలో నెంద ఱెంద ఱెంతెంత యాస్తిని దమ కులాచారము ననుసరించి సంపాదించి యుండిరి. అది పాపమా! చూడు.

సీ. ధనకోటి నఱచేత నునిచి యాతనిసొత్తుఁ
గొనినమీనాక్షి కేకొల ఘటిల్లె
మానపాలునిచేత మాన్యంబులనుగొన్న
పద్మాక్షి కేమిపాపంబు గల్గె
రత్నవర్తకునివస్త్రము లెల్లఁ జేకొన్న
కనకాంగి కేమియఘంబు గల్గె
కృష్ణభూపాలుధాత్రీతలంబునుగొన్న
కుటిలకుంతలి కేమి కొఱత కల్గె
గీ. దనకులాచారధర్మముల్ దప్ప కుండ
వర్తనము సేయ నేమి విపత్తు కలుగు

దీనిమర్మంబుఁ దెలియని దాన వగుట
శంక నొందెద వది యింకఁ జాలు నమ్మ.

ఊరక లేనిపోనిభ్రాంతి నొంది ధనసంపాదనమున కనుకూల మైనయీ యౌవనప్రాయమున మూఁగతనంబు వహించి యుండెద వేల? పిమ్మట మన మొగముఁ జూచువా రెవ్వరు?

గీ. సౌరభం బుండువఱకె పుష్పవ్రజంబు
జనుల కెల్లను భోగ్య మై తనరునట్లు
ప్రాయ మున్నంతవఱకె యీకాయ మువిద!
సరసభోగార్హ మై యొప్పెసంగు చుండు.

కావున,

క. జవ్వన మున్నప్పుడ వెల
పువ్వుంబోడులకు విటులపొందిక ద్రవ్యం
బెవ్విధి గడియించుట చను
నవ్వలఁ గొఱ గారు గవ్వ కైన లతాంగీ?

సీ. కనుసైగఁ జేసి చక్కనిమాటఁ దనియించి
ధనధాన్యములు చూఱఁ గొనఁగ వలయు,
పైవిభ్రమముల వెంబరివానిఁ గావించి
కాంచనాంబరము లార్జించ వలయు,
టక్కుపిక్కులు చేసి మక్కువ నెలకొల్పి
బహుభూషణములుఁ జేపట్ట వలయు,
కల్లకూర్ములు చూపి కౌఁగిలి ఘటియించి
యెల్లవానిని సంగ్రహింపవలయు.

గీ. ఇట్లు మాయాప్రచారంబు లెల్లఁ జూపి
విటుల వలపించి వారల వెట్టిఁ బెట్టి
వలయునవి యెల్ల గడియింప వలయుఁ గాని
వెలవెలందుల కూరక వలచు టగునె?

నేఁ జెప్పినట్లు నీ వాచరింపనియెడల ద్రవ్యంబు సున్న యగును. అది లేనిచోఁ నిఁక భోగసౌఖ్యంబు లెక్కడినుండి వచ్చును? ఇప్పటినీయౌవనమున నే నీ వట్టిద్రవ్యము గడింప లేనిచోఁ బిదప నీ మొగముఁ జూచువా రెవ్వరు? నామాట కా దని మోడి వహించి యూరకున్న, నీచీరకును సింగారమునకును గూడఁ గర వగును. బాగుగ నివి యన్నియు నీ బుద్ధిని యోచించి చూచుకొనుము.

రాగ—(తనలో) నిజముగ ద్రవ్యమే భోగములకు మూలము. అది లేనియెడల నన్నియుఁ గొఱఁతయే యగును. ఇంతవఱకు నిజమే. ఇప్పుడు నే నేమి చేయను? (ప్రకాశముగా) అమ్మా! న న్నేమి చేయు మనెదవు? నేను నామనోహరునిమాత్రము వీడఁ జాలను.

కుటి—బిడ్డా! నీమాట కే నడ్డుచెప్పఁ గలనా? నీవు నీమనోహరుని వీడుట యెందుకు? వానిని విడువ నవసరము లేదు. నేను చెప్పినట్లుమాత్ర మొనర్పుము. అట్లు చేసిన మనకు ధనంబున కెట్టికొఱంతయుఁ గలుగదు.

రాగ—ఏమి చేయను?

కుటి— గీ. కలఁడు సంకల్పసిద్ధాఖ్య వెలయు చుండు
ద్రవ్యవంతుండు మనమనోరమప్రియుండు
వానిదాతృత్వమహిమంబు వానిఖ్యాతి
నీ వెఱింగియు యుందువు నెలఁతమిన్న.

రాగ—ఆఁ. విని యున్నాను.

కుటి—అతని నొక్కసారి నీవు చూచిన వలయునని యెల్ల నీ కపారంబుగ నొసంగఁ గలఁడు. ఇదిగో నిటు చూడుము. వానికోసము నీవు పనిగట్టుకొని వెళ్ల నక్కఱ లేదు సుమా! ఇక్కడికే వచ్చును. ఇప్పుడు నీవు కట్టుకొన్న యీచీరయుఁ బెట్టికొన్నయీభూషణములును నాతఁడు నాకు బహుమానముగా నిచ్చినవేసుమా! నీమనోహరునియందు నీ వెట్టి యనురాగముకలదాన వైనను ద్రవ్యమునకై యీసంకల్పసిద్ధునిఁ జూడక

తప్పదు. ఇందు నీకు త ప్పేమి కలదు. అతనిదాతృత్వమును చూచి తీరవలయును.

రాగ—(తనలో) అబ్బా! ఆతఁ డింతటియుదారశీలుఁడేమి? వాని నొక్క సారి చూచిన మన కేమి తప్పు? (ప్రకాశముగా) తల్లీ! నీయానతి నా తనిదర్శనంబుఁ జేయ నీయకొంటిని.

కుటి—(తనలో) ఆఁ. దారిలోనికి వచ్చినది. ఇంక దీని నాయిచ్చవచ్చిన రీతిని ద్రిప్పికొన వచ్చును. (ప్రకాశముగా) బిడ్డా! ఆతఁడు మహాను భావుఁడుసుమా! లేని యెడల వాని కట్టియుత్కృష్టమహిమ మేల కలుగును? అందుచేత నే యాతనికి సంకల్పసిద్ధుఁ డనునామము కలిగినది.

(తెరలో)

అందుకుఁ దగినవాఁడే. అట్టిమహానుభావుఁడే.

ఆ. వె. సకలజనులకోర్కు లకలంకమతితోడఁ
దీర్చువాఁడు మేలు గూర్చువాఁడు
చారుగుణయుతుండు సంకల్పసిద్ధుండు
కాఁడె, వాని కడ్డు గలదె జగతి.

కుటి—(ఆలించి) బిడ్డా? వింటివా! ఆహా? దేవతలు గూడ వియత్పథంబునఁ బోవుచు మిన్ను ముట్టినయశోవల్లిక గలయాతని నామసంకీర్తనంబు సేయు చున్నవారు. ఔరా! జన్మ మ[illegible] నాతనిదే జన్మ!

రాగ—ఆతఁ డట్టిమహానుభావుఁ డేమి?

కుటి—ఇట్టివాఁ డని చెప్పుటకే నోరొక్కటిచాలదు. వేయి మోములు గల యాదిశేషుం డాతనిదాతృత్వాదిగుణంబు లించుక వర్ణింపఁ గలఁడేమో?

రాగ—(ఉత్సాహముతో) అటు లైన నామహాత్ముని దర్శనము తప్పక చేయ వలయును.

కుటి—అవును. అట్లు చేసి పావనత్వంబు వడయ వలసినదే.

రాగ—ఆతఁ డెప్పుడు వచ్చును?

కుటి—ఇప్పుడే.

[అప్పుడు కాంచనాంబరవిభూషణాదులతో సంకల్పసిద్ధుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

సంకల్ప—సీ. విత్తంబుల నొసంగి చిత్తంబు లలరింతు
భూషల నిచ్చి సంతోష మిడుదు
మృదుపటంబు లొసంగి హృదయంబు లెసఁగింతు
నవ్యాంబరముల నానంద మిడుదు
విలువవస్తువు లిచ్చి చెలఁగు నట్లొనరింతు
పసిఁడిచేలము లిచ్చి ప్రమద మిడుదు
కలమాన్నము లొసఁగి కడుముదం బొనరింతు
నెడదఁ గోరినవాని నెల్ల నిడుదు,
గీ. వాస్తవమె కాని యియ్య దాశ్చర్యస్తవంబు
కాదు తెలియనివారికి బీదలకును
దెలుపఁగా నిట్లు చెప్పఁగా వలసె నాకు
నీతివిదులార నన్ను మన్నింప రయ్య.

కుటి—(హెచ్చరికతో) అదిగో! మహానుభావుఁడు సంకల్పసిద్ధుఁడు. మన మాతని కెదురుగఁ బోయి తగినసన్మానముతో నిటకుఁ దీసికొని వత్తము లెమ్ము.

రాగ—(చూచివిభ్రమముతో) ఆహా? ఈమూర్తి తేజోధికత నాకనుల మిఱుమిట్లు కొలుపు చున్నదే. ఈతండు మనుష్యమాత్రుండు కాఁ డని నిశ్చయముగఁ జెప్ప వచ్చును.

శా. సాక్షాదీశ్వరుఁడీ మహామహుఁడుగా సర్వాంసహాపాలనా
దక్షుం డై భువనప్రమోదముగ నాత్మస్థాన మై యున్నయీ
ప్రాక్షారామపురంబుఁ బ్రీతి మెయిఁ జేరం బోలుఁ గా కున్న నీ
యక్షీణోజ్జ్వలతేజ మి ట్లెసఁగ నేలా యద్వితీయంబుగన్.

ఈతండు నాకె కాదు సకలప్రపంచంబునకును గూడఁ బూజనీయుండును వందనీయుండును.

(ఇరువురు నెదురుగఁ బోయి నమస్కరించు చున్నారు.)

సంకల్ప—మీమీమనోభీష్టంబులు సిద్ధించుఁ గాక.

కుటి—దేవా! దయ చేసి యీయాసనంబు నలంకరింపుఁడు.

సంకల్ప—(అట్లు చేయు చున్నాఁడు.)

కుటి—మహాత్మా! నేఁడు తా మిటకు విచ్చేయుటం జేసి మాగృహంబు పావనం బయ్యె. మేము పాపరహితుల మైతిమి. పిచ్చుకగుంటమీఁద భాగీరథి ప్రవహించినట్లు తమయవ్యాజకరుణా కటాక్షరసము నేఁడు మామీఁద ప్రవహించినది. మేము ధన్యుల మైతిమి. దేవరవారు సేవకురాలికోర్కి చెల్లించి రంతియె చాలును. ఇఁక సకలంబును సుముఖం బుగనే ప్రవర్తిల్లఁ గలదు.

సంకల్ప—కుటిలాలకా! ఇది యెవ్వరు?

కుటి—అయ్యా! ఇదియే నాకూఁతురు రాగమంజరి. ఈమె దేవరవారిదర్శన మెన్నఁడును జేయ లేదు. తమపాదసేవ సేయుటకుఁ దగినదియే.

సంకల్ప—(తనలో) ఊఁహూ. దీనిసైఖరి చూడ నట్లె కనఁబడు చున్నది. ఈవస్త్రాద్యలంకారములలోఁ గొన్నిటి నీసమయమున నిచ్చెదను. ఇవి యిప్పుడు దివ్యౌషధంబురీతి పనిచేయఁ గలవు. (ప్రకాశముగా) కుటిలాలకా! ఇవి నీకూఁతున కిమ్ము.

కుటి—అట్లు దేవరవారే యనుగ్రహింతురుగాక.

సంకల్ప—అట్లే చేయుదము. (రాగమంజరివంకఁ దిరిగి)

గీ. వసుధ నసమానరూపలావణ్యగతులఁ,
బరువమున, నాటపాటలపాటవమునఁ
జేరుకొన్నట్టినెఱజాణ! ప్రియము మీఱఁ
జేకొనుము వీనిఁ బారితోషికము గాఁగ.

రాగ—(సిగ్గుచేఁ దలవెనుకకుఁ ద్రిప్పి తనలో) అయ్యో! వీనికడ నివి నే నెట్లు కైకొందును? నామన సొప్ప కున్నది. ఈయమూల్యాభరణంబులు చూచినకొలంది మరల నొకమూల నాసయుఁ బొడము చున్నది. ఏమి చేయుదు?

సంకల్ప—అది యేమి యట్లు సందేహించు చున్నది?

కుటి—స్వామీ? మ ఱేమియు లేదు. ఇది క్రొత్త గదా? ఆకారణమున సిగ్గుచే నట్లు తటపటాయించు చున్నదే కాని వే ఱొద్దియుఁ గాదు. బిడ్డా! ప్రభువువా రమూల్యాభరణంబు లిచ్చు చుండ వానిం బుచ్చుకొన బిడియపడెద వేల? లెమ్ము. అవి యందుకొమ్ము.

రాగ—(లేచి పెడమొగముతో చేతులు చాఁచి యవి పుచ్చుకొనుచున్నది.)

కుటి—(తనలో) ఆఁ. ఆస పుట్టినది. ఇంక మనతలంపులు గట్టెక్కినట్లే.

సంకల్ప—(తనలో) వహ్వా! ఇది యిఁక మనకుఁ జిక్కినది.

గీ. వనిత సిగ్గుచే మోము నావలకుఁ ద్రిప్పి
వస్తువులమీఁది నెపమున హస్తయుగము
ముందునకుఁ జాఁచి తనమనోమోద మూర
వెల్లడి యొనర్చు చున్నది వింత మీఱ.

రాగ—(తనలో) ఈయపూర్వవస్తువులు నామనంబున కానందము నే కలిగించు చున్నవి. కాని నామనోహరునిఁదలంచికొనిన నివి విషాదజనకంబు లగు చున్నవి. అందువలన నాహృదయము వికలత్వము నొందు చున్నది. హృదయమా! శమించుము. శమింపుము.

కుటి—దేవరవారికి వృథాశ్రమ కలుగఁ జేసినందుకు దాసురాలిని మన్నింపుఁడు.

సంకల్ప—ఆఁ. శ్రమ యేమి? అభిమతకార్యంబులపట్ల నది గణింపఁ బడదు కదా!

రాగ—(భూషణములవైపు చూచు చున్నది.)

సంకల్ప—(పరికించి తనలో)

గీ. నగలపై దృష్టి నిల్పి యీనాతిమిన్న
నెమ్మదిని నన్నుఁ గను చుండె నిశ్చయముగ
యోగి భ్రూమధ్యమున దృష్టి నునిచి యచల
గతిని బ్రహ్మస్వరూపంబుఁ గాంచునట్లు.

కాని యాతఁడు తన్మయానందముతోఁ గను చున్నాఁడు. ఈమె యెట్టి హృదయముతో నున్నదో కదా!

కుటి—అనురాగపూరిత మైనహృదయముతో—

రాగ—(కాలి బొటవ్రేలితో నపవారించుచు) మహాత్ముల సేవ దాసులు చేయు చుంద్రు.

కుటి—ఇప్పట్టున దాసురాం డ్రనుచు.

రాగ—అమ్మా! ఈవిభూషణములు దాచి పెట్టుము.

కుటి—అలంకరించుకొనుము.

సంకల్ప—అట్లొనర్చిన బాగు.

కుటి—కానిండు. ఇవి తరువాత ధరించుకొన వచ్చును లెండి. ఇట్లనుట దాని కిష్టము లేక కాదు. దానికిఁ దగినమంచికారణమే యొకటి యున్నది. అది మీకును దెలిసియే యుండును.

సంకల్ప—అవును నాకును దెలిసినది. క్రమముగ నివి ధరింప వచ్చును. కానిమ్ము. మేము వచ్చినపని యైనది. మేము పోయి వత్తుమా!

కుటి—తమయనుజ్ఞనే నే మనిమనవి యొనర్పఁ జాలుదును. మఱల మరలఁ దలుచుగ దర్శన మీయ వలయు ననిమా రాగమంజరి కోరు చున్నది.

సంకల్ప—దాని కేమి యభ్యంతరము. దానియభీష్టమే నెరవేరుఁ గాక.

కుటి—తమయాశీర్వచనము ఫలింప వలయును.

సంకల్ప—అందున కేమి లోప ముండును. కాని మాసదుపదేశమును మఱువకుము.

కుటి—చిత్తము. తాము సంకల్పసిద్ధులరు. తాము తలంచినదాని కన్యథా కలుగునా?

సంకల్ప—అది దైవకృప. (అని నిష్క్రమించు చున్నాఁడు.)

రాగ—అమ్మా! ఈతఁడు మహానుభావుఁడే యని నాకుఁ దోఁచు చున్నది. దేవతాస్వరూపుఁడు. ఇందున కీయపూర్వాలంకారములే సాక్షీభూతము లైయున్నవి.

కుటి—అది నిజమే—అఁ. నీ కొక్క మాట చెప్ప మఱచితిని. అది నీ కప్రియమే యైనను జెప్పక తప్పదు.

రాగ—అది యేదియో చెప్పుము. నామనంబున కారాటము కలుగు చున్నది.

కుటి—మఱేమియు లేదు. మన మనోహరుని విషయ మై.

రాగ—ఏ మది?

కుటి—ఈతఁడు ప్రతిదినము భీమేశ్వరారాధనమునకై యేగి చేయుచున్నది నీవు వింటివా? మనోరమతోఁ జెలిమిచేయు చున్నాఁ డఁట.

రాగ—(నివ్వెఱతో యోచించి) అట్లు కాదు. మనోరమ యీయనతోఁ జెలిమిచేయ యత్నించు చున్నదనుము.

కుటి—కాదు. కాదు. ఆప్రయత్న మీమహాత్మునిదే. ఇతఁ డేమి తిన్న నైనవాఁడా యేమి?

రాగ—(కోపముతో) ఇంతయు నిజమేనా?

కుటి—నే నేమి యబద్ధము లాడుదు ననుకొంటివా?

రాగ—ఔరా! ఎంతటిమోసకాఁడు నాఁడునాచే నెన్నియో బాసలు చేయించుకొని తుద కింతటిమోసము చేయఁ దలపెట్టెఁ గదా! ఈకాలమున నొకరి నొకరు నమ్మఁ బని లేదు. హా! మనోహరా! ఎంత పని చేయుచుంటివి?

శా. నాఁ డారీతిని నన్ను మాయవగలన్ నమ్మించి బల్ బాస లా
జాడన్ జేయఁగఁ జేసి నేను వ్రతనిష్ఠాయుక్తిఁ బోకార్చి నీ

తోడఁ గాలము బుచ్చువాఁడ నని నాతోఁ దెల్పి దుర్వృత్తి మై
నేఁ డీరీతిని జేయఁ బూనితి వహో ని న్నెట్లు నమ్మం జనుఁ.

ఇట్టిదుర్బుద్ధి పుట్టుటచేతనే భీమేశ్వరారాధనము పేరు పెట్టుకొని యేగి యింత యాలసించు చుంటివి. నీమాయానటన లన్నియు నా కిప్పుడు బాగుగఁ దెలియ వచ్చు చున్నవి.

కుటి—బిడ్డా! నీ కొతనియం దింతవఱకు వెఱ్ఱినమ్మక మొకటి యున్నది కాని, వాని నటనలను బట్టి యాతఁ డిట్టివాఁడని నేను తొలినాఁడే గ్రహించి యుంటిని. ఏమనిన నీకేమికోపమువచ్చునోయనియూరకొం టిని. తుదకుఁ గ్రమక్రమముగ నీకే తెలియ వచ్చినది. చూచితివా? ఈతనివలన నిప్పుడు నీవు రెండువిధములఁ గూడఁ జెడినదాన వైతివి. పెద్దదాన నగునామాటలు వినక పోవుటవలనఁ గదా నీ కిట్టియవస్థ వచ్చినది.

రాగ.—అమ్మా! నా కిప్పు డేమియుఁ దోఁచుట లేదు. నాశరీర మాపాద మస్తకమును మంట లెత్తు చున్నది. చిత్తము పరిపరివిధములఁ బోవు చున్నది. అక్కటా! ఎంతటిమోసకారి.

కుటి—(తనలో) వహ్వా! ఈటంకముచేఁ, జెడిపోయిన దనుకొను చున్న కార్యము మరల నడుకఁ గంటిని. ఈసారి పూర్తిగ దీనిమనసు విఱచి యామనోహరుని వెడల నడచెదను. అట్లు చేసిన గాని నాకసి దీఱదు (ప్రకాశముగా) తల్లీ! తొందర పడకుము. మనోహరుఁడు వచ్చువేళ యైనది. ఇప్పటి కిది గుప్తముగ నుంచుము. తరువాత సంగతి నీకుఁ దెల్పెదను. ఇందుకుఁ దగినప్రతీకారము లేక పో లేదు.లే. (అని రాగమంజరితోఁ గుటిలాలక నిష్క్రమించు చున్నది.)

ఇది చతుర్థాంకము.

# ధ నా భి రా మ ము.

## పంచమాంకము.

[మనోహరుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

మనో — సౌధాగ్రమున నెల్లెడ వెదకితిఁ గాని చాన కానఁబడ దయ్యె. ఇప్పుడు భీమనాధుని సేవకై పోవుచుంటిని. నేఁ డేమియో గాని నా మనంబున నొకవిధమైన వికారము పొడము చున్నది. నాయెడమక న్నదరుచున్నది. అందున కనుగుణముగఁ గనకలత చెప్పినరీతి నీరాగ మంజరికి నిజముగ నాయం దనురాగము తగ్గిన ట్లనేక నిదర్శనములు కాన వచ్చు చున్నవి. మునుపటివలెఁ గాక యాకోమలి వేఱురీతిగా సంచ రించు చుంట నిజము. ఇఁక నాగతి యేమి? కుబేరుండుకోటలోఁ బాగ వేయును గాఁబోలును. నాగుండెలు తటతట గొట్టుకొను చున్నవి. తొలుత నాతోఁ బలికినశపధము నైనఁ దలంపక నాయందుఁ గలవలపు నాఁడిఁ బుచ్చి యీయింతి న న్నిట్లసడ్డ చేయునే? కనకలత నా కెఱింగించువఱకు దీనినిగుఱించి బాగుగ యోజింపనైతి. తొలుత నే యిది వారకాంత యని యెఱింగి యుండియు నమ్మికఁ గాంచినన్ను నేన నిందించుకొనవలయును. ఇప్పుడు నాకు దేవళమున కేగుటకుఁ గాని, రాగమంజరీసౌధమ్మునకు మరల నొక్కసారి పోవుటకుఁ గాని కాలాడక యున్నది. నా కీదేవాలయ బాహ్యప్రదేశమే త్రిశంకు స్వర్గమైనది. ఏమి చేయుదును?

చ. శపథము లెన్నిరో పలికి జవ్వని నవ్వులపాలు సేయఁగాఁ
  గపటము సేయనోపు నటుగానియెడన్ నను వీడి యుంట కే

నెపములు గల్గుఁ దొల్త నిది నెమ్మదిఁ గాంచియు మోసపోతి మో
సపువగలాడి యైనవెలచానకు చేష్టల నక్కటక్కటా!

(తెరలో)

క. "నాతోడ నెడసిపోయిన
కూఁతు మరలఁ గలపికొంటిఁ గోరికఁ గంటిన్
నాతపము పండె నాదు
ర్జాతివిటునిపొగరడంచి చక్కఁబఱచెదన్."

(ఆలించి) అదిగో వేశ్యమాత యగుకుటిలాలక యిట్లే వచ్చుచున్నది. రాగమంజరిజాడ దాని నడిగి తెలిసికొందును గాక. అయ్యో! ఇది నాకు మొదటినుండియు వ్యతిరేకముగా నడిచెడిప్రముఖురాలే. దీని నే నెట్లడుగుదును? అయిన నొక్కసారి యడిగి చూచెదను.

[అంతఁ గుటిలాలక ప్రవేశించుచున్నది.]

కుటి—(మనోహరునిఁ దిలకించి తనలో)

గీ. కేల నున్నవెల్లఁ గోలుపోయినయట్లు
భిక్కమొగముతోడ నుక్కఁ దక్కి
మసలుచుండె నిచట మాపూర్వజామాత
పట్టిగొడ్డుపాడి వానిచెల్మి.

వానిజోలి నా కేల? నేను నా కూఁతును నూతన జామాతను జూడఁ బోయెదను. ఈదినమున నాతఁడు భీమేశ్వరునకు మహోత్సవము సేయించు ననియు, నాసమయమున భక్తజనపరతంత్రుం డగుదేవుం డెల్లరకుఁ బ్రత్యక్ష మగు ననియు జను లెల్లచో గుంపులు గూడి చెప్పుకొను చున్నారు. ఏతత్సందర్భనంబున నేను తప్పక చరితార్థురాల నగుదును.

మనో—(సమీపించి) అత్తా! ఎచ్చటి కిట్లు బయలుదేరితివి? నీకూఁతు రెచ్చట నున్నది?

సీ. గడనకత్తెలు వోవుచెడుగు త్రోవలు మాని
విఖ్యాతిమై ధాత్రి వెలయుదాని
నీకూర్మితనయ యై నిరతంబు నీయింట
మించువేడుక సంచరించుదాని
నిజరూపసౌందర్య నియతిచేతమనోహ
రునిఁ కౌఁగిటను జేర్చి తనరుదాని
వివిధకళాభ్యాస విభవంబుచే నార్య
సన్నుతులను బొందు చున్నదాని.

గీ. సకలలోకానురాగప్రశస్తగతుల
వలన రాగమంజరి యనఁ బరగుదాని
నాదుప్రియురాలి నేఁడు గానంగ నైతి
దానిపోకడఁ దెలియుదు వేని చెపుమ!

కుటి—(తనలో) వీఁడు నాతనయకై పిచ్చివానివలెఁ దిరుగుచు నన్నడుగు చున్నవాఁడు. ఇంక నాయిష్టము వచ్చినట్లు వీనిని నాకసితీరఁ దూల నాడి మఱి పంపెద. అంతతో నీనిర్భాగ్యుఁడు మమ్ము పూర్ణముగా విడిచి పోవు. మాయమ్మి నాయాజ్ఞచొప్పున నడచు చుండ వీఁడు న న్నేమి చేయఁ గలఁడు? ముందుగఁ బరిహాసముగ మాటలాడి తరువాత నా చాకచక్యము చూపెదను. (ప్రకాశముగా) ఓహోహో!

క. మీ రెవరు? మనోహరులే
కారా! మిము వీడి రాగగౌరవ మెద గా
నేరీతి జరిగెఁ? గామిని
మారా మెది యైనఁ గలదొ? మాకుఁ దెలుపుఁడీ!

మనో—(తనలో) ఇ దేమి! ఇది నామొగ మెఱుఁగనట్లు మాటలాడు చున్నది. ఇది నన్నుపహసించు చున్నది. కానిచో దీని కీదీర్ఘము లేల?

కుటి—

శా. ఏ మయ్యా! యిటు మౌనముద్ర గలవారే మీరు! మీప్రశ్నకే
లా మారుత్తర మీయఁ జూడ? రిది మేలౌ! వృద్ధవారాంగనా
స్తోమం బించుక మాట లాడఁ దగదో చోద్యంబుగా నుండె ని
ష్ఠా మీకన్నుల కేను గానఁబడు టాహా! కాల మి ట్లయ్యెనే.!

మనో—(తనలో) పూర్వము తన్ను సరకు సేయక తనతో మాట లాడ కుంటి ననియు, నిప్పు డవసరమునుబట్టి మాట లాడవచ్చితి ననియు, న న్నిది యధిక్షేపించు చున్నది. నే నిప్పు డే మన్నను మ టింత చెల రేఁగును. మంచిమాట లాడి తప్పించుకొని పోయెదను. (ప్రకాశముగా) అత్తా! నేను మౌనముద్ర గలవాఁడ ననుకొంటివా? ఎప్పుడు న ట్లను కొనకుము. ఇప్పుడు నీకూఁతు రెం దేగిన దని యడుగు చున్నాను.

కుటి—(గర్వముతో) మీ రిచ్చెడుజీతనాతములకు మే మిప్పుడు మారుత్తర మీయక తప్పదు.

చ. ఘనమగు మోహబంధమునఁ గాంతకు మీర లొసంగినట్టి యా
ధనకనకాదిభూషణవితానము లెక్కకు మీఱి యేడఁ జూ
చినఁ బడి పొర్లు చున్నయది శ్రీ గలవారలకిట్టిత్యాగ మెం
దు నరిది మాయదృష్టము మనోహర! నీకడఁ గాంచఁ గల్గుటల్.

ఔరా! వెక్కసముగ నీ వొసంగినయాధనరాసులచేఁ గాఁబోలును రాగమంజరి యిప్పు డోడలు మఱచి యెవ్వరికిని గానఁబడ కున్నది. ఎప్పుడును మీమాట విన్నఁ బరుగెత్తుకొని వచ్చెడిదే!

మనో—నేను నిరర్థకుఁడ ననియుఁ గాసువీస మీయఁ జాలనివాఁడ ననియు న న్నధిక్షేపించు చుంటివా? మనసు కలసినవారలకు ధన మేల? ధనాదులవలనఁ గలిగినదానికంటె మనసు కలసినసరసంబు మనోహరంబు కదా!

కుటి—బళీ! మంచిసరసుఁడవు దొరకితివి. ఇఁక మా కేమి కొదువ?

ఉ. ఓయి మహావివేకి వినవో! సరసుండ నటించుఁ జెప్పఁగా
నీయెడ నో రె టాడె ధన మీయక మెత్తురె వారకాంత ల
త్యాయతరూపగర్వితసుమాస్త్రుని నైనను, శాస్త్రవట్కథా
రేయుని నైన, ము న్నిది యెఱింగి విటత్వము సేయఁ జెల్లదే?

మనో—ధనము లేకుండిన సరసంబున కేమికొదువ?

గీ. విత్త మొకయింత లేనంత విటున కింత
చుల్కఁదన మబ్బునే యిట్టిపలుకు లేల?;
రసికు నొకమారు కలసినబిసరుహాక్షి
విరసుఁ డగుద్రవ్యవంతు భావించు నొక్కొ?

కుటి—(కోపముతో) విత్తకాంత లని యెఱుంగక నాయెదుట నెద్దియో తాటబూటు చేసి మాట లాడఁ జూచెద వేల? నీవు డబ్బు దస్కం బీయకుండుటయె గాక, యెన్నాళ్లనుండియొ మేము కష్టపడి సంపాదించుకొనినధన మంతయుఁ గ్రమంబున మాయము చేసి, విత్త మెందులకు, విత్త మెందుల కని నుడివెద వేల? చాలు! చాలు!

క. నీరూపము నీసరసత
వారవధూమణులచెంత వర్ణించెద వ
య్యారే! ద్రవ్యము చూపక
మారుమసలఁ జెల్ల దింక మాసదనములన్.

అది య టుండ నిమ్ము. సరసము, సరసమని చెప్పునీ వెట్టిసరసుండవు?

ఉ. మానవబోణితోడఁ జనుమాన మొనర్చిననాఁటగోలె నె
ళ్లైనను నుంటి గాని యొకయప్పుడు ముచ్చట కైన నక్కటా!
కానక యుండఁ బట్టు మని కాసొక నైనను జేతఁ బెట్టితే,
నాన దొరంగి చూచె దిది నవ్వులమిందరికంబె చెప్పుమా!

ఉ. సోలున మూలయున్ దెలియఁ జాలక చాలఁ బరిభ్రమించుమా
గోలకు నీవు కన్బడితి కోతికిఁ గొబ్బరికాయయట్లు, చాల్

చాలును మంచివాఁడవె బళా! పదివేలును వచ్చె, ముగ్ధలీ
రాలను బిండఁగా దివిరి రక్తముఁ గోల్పడు చుందురే కదా!

మాయమ్మితోడిచేడియ లందఱును నమితంబుగ ధనధాన్యంబులు గడించి నిత్యంబును మనోహరం బగువివిధోత్సవంబుల మహానందలీలఁ గ్రుమ్మరు చుండఁగాఁ జూచుచు గ్రుక్కిళ్లు మ్రింగు చుండుటయే గాని మా కా పాటిభాగ్యంబు లేక పోయెఁ గదా!

సీ. రూకలా కోకలా రూప మున్న దటంచు
మురిసెదు మా కేమి యొఱిగె దీనఁ
పండుగా పబ్బమా మిండాటమే కాని
యందున మా కేమి చెందఁ గలిగె,
అచ్చటా ముచ్చటా వెచ్చపెట్టుటె కాని
యిట్లైన మాయొడి యేమి నిండె,
తోఁటలా పేటలా తొడుసుమాటలె కాని
యారీతి మా కేమి చేరఁగలిగె,
గీ. నగలనాణెములా చూపువగలె కాని
వానివల్లను మా కేమి వచ్చెనేమి
సొగసు, శుభక్రియంబులు శూన్యహస్త
ములును నాయొద్ద చెల్లునే మనుపువోలె.

మనో—(తనలో) ఓహో! ఇది చెలరేఁగి నోరికి వచ్చినట్లు ప్రేలుట కుపక్రమించు చున్నది. ఇంక నే నెట్లు తప్పించుకొని పోవుదును? అయిన నిట్లు పలికి చూచెదను. (ప్రకాశముగా)

చ. సరసము మాని యిట్టు లెకసక్కెము లాడెద వేమి? రాగమం
జరి ధనకాంక్షచేత నె నిజంబుగ నక్క గయికొన్న దైన డె
ప్పరముగ సొమ్ముగాదెలు సెబాసన నీయిలుచుట్టుఁ గట్టనే;
దురుసులు పల్కఁ జేల యలతోయరుహాక్షి నెఱుంగఁ జెప్పుమా.

కుటి—ఈ మొగమిచ్చకపుమాటల కేమిలే. అయ్యో! ఆపాటి దైన మా కీపాటు లేల?

ఉ. చాలును జాలు వట్టిసరసా లివి యేటికి మానుమయ్య, తాం
బూలపుంగర్చు కైన వెల బుట్టనివాఁడవు ద్రవ్యరాసు లే
లీలను గూడఁ బెట్టెదవు? లేశము ద్రవ్యము నీని నీదువే
సా లిట నాసమక్షమున సాగునె తేరబొ భుజంగ పా ప్మిఁకణ.

రోవెలందుల కొక్క—ముడుపె కాని వట్టిసరసంబులును గిరసంబులును గిట్ట వని త్రోల్తునె నీ వెఱుంగవా? సిగ్గు మాలి చేత కాసు వీసమును లేక యే మని మిండరికంబు సేయ వచ్చితివి? ఎట్టిమాయలు మందులు సంగ్రహించితివో కాని ముద్దరా లగుమాముద్దియను నిస్సారణముగ నాతో నింతదనుకఁ దిన్నగ మాట లాడ కుండఁ జేసితివి. అదియే సరసము. అది చాలదా? ఇంక నాతనయపై రెత్తినచో ని న్నేమి చేయింపెదనో చూడు. ఔరా! ఎంతఘాతఁ దలంచితివి? ఇంతదనుకఁ దెలియక పోయెనే. తల్లిబిడ్డల వేఱు సేయుదువుగా? ఛీ! యింక నీ మొగము చూడ రాదురా. పొమ్ము. పొమ్ము. భుజంగగారుడం బని న న్నెఱుంగవు కాఁబోలును.

మనో—(కోపముతోఁ దనలో) ఛీ! యిది మేర మీఱి మా టాడు చున్నది. తగినట్లు బుద్ధి చెప్పి కుటి పోయెదను. అందాఁక నెందుకు బెదరించి విడిచెదను. ఈ నీచపుతొత్తుతో నా కేల? (ప్రకాశముగా) ఏమీ మేర మీఱి మాటాడు చుంటివి?

ఉ. ముచ్చెలఁ దీసి కొట్టెదను మూర్ఖపిశాచి- మ ఱొండుమాటరా
నిచ్చిన నన్ను నెవ్వనిగ నే మని యెంచుచు నుంటివో, ప్రియం
బచ్చుపడంగఁ జూచికొను మల్లుఁడ జెల్లునె పొల్లుమాట లీ
విచ్చుటఁ బల్కు నీతనయ యియ్య దొకించుక విన్న నైచునే.

కుటి—(కోపముతో) ఛీ! ఛీ! ఏ మని ప్రేలు చుంటివి? ముచ్చెలచేఁగో

ష్టైద వేమి ? నీచేఁ బడుటక్కే మే మీరీతి నుంటిమి కాఁబోలును. ఓరీ! నా కెక్కడియల్లుఁడవురా !

శా. ఛీ ! విశ్వాసవిహీన ! మాగృహమునన్ జీవించి యామేల్మి నీ
వావం తైనఁ దలంప కెంతపని చేయం జూచి తౌరా ! ననుఙ్
గావం గొట్టను నీవె కర్తవ భుజంగవ్రాతజీమూతజం
ఝూవాతం బగు వేశ్యమాత నని యెంచం జాలవో నెమ్మదిఙ్.

ఓరీ! నిరర్థకా ! ఇఁక మాగడపలోఁ గాలు పెట్టుదువు గానిలే. ఛీ! నీతోడ వ్యర్థాలాపంబు లేల ? ఇఁక నీమొగము చూచుచు నిట నిల్వ నోప. (అని నిష్క్రమించు చున్నది)

మనో—అబ్బ ! గాలివాన యడఁగినదే—అన్నా ! నాబ్రదు కెంతయూఅడి యైపోయినది. ఇంక నిది నిశ్చయముగ రాగమంజరిని నన్నుండి వేలు సేసిన దనియే నమ్మెదను. లేనియెడ దీని కీధిరాలాపము లెక్కడివి ? అకటా ! కుబేరునితోడఁ జలిచినపన్నిదంబున మదనుం డోడె ననునప ఖ్యాతి లోకంబున నాచంద్రతారకంబుగా నిలిచిపోవునే. ఇంక నేనేలీల దేవేంద్రాదులమొగంబులు జూడఁ గలుగుదును ? గడనకత్తె యని యెఱింగి యుండియు దీని నే నెట్లు నమ్మితి—నమ్మక చేయున దెద్ది ? వల దని నాభార్య యగురతి యెన్ని బోధించినను వినక, యిది యేమో ఘనకార్యం బని వచ్చి తుద కీచెడిపచే నిట్టు లనరానిమాట లనిపించు కొంటి. అనుపయోగం బైనయీనారూపం బేమిటికి కాల్పనా? ఒక్క యాఁడుదానిని లోఁబఱచుకొన నేరకపోయితినే. అఖిలలోకంబుల నల్లాడించెడియేకవీరుండ నని విఖ్యాతిఁ గాంచిననాకు, తుద కీనీచదశ సంప్రాప్తించె. శాంబరీవిద్యాసంపన్నుండ నని పొగడ్త కెక్కిన నేను ఒక్కవ్రముక్కడిగడనకత్తెమాయలకు లోనుగావలసివచ్చె. ఆహా ! విధాతచెయ్దమతివిచిత్రము గదా ! అన్నా ! వారకాంత వింతజంత లగుదురే.

గీ. అతులరూపసంపదభియుక్తుఁడైనను
మహితమదనశాస్త్ర విహితుఁడైన
ద్రవ్యవంతుఁ డగుచుఁ దనరక యుండిన
వారకాంతమనసుఁ జేరఁ బోఁడు.

దరిద్రుం డెట్టివిద్యాసంపన్నుం డైన నేమి? ద్రవ్యహీనుండును జచ్చినవాఁడును నిక్కంబుగ నొక్కటియ.

[తెరలో కలకలము]

(ఆలించి) ఇదిగో నీ యాలయమున నెద్దియో కలకలధ్వని వినవచ్చు చున్నది. సావధానమనస్కుండ నై యాలకించెదఁ గాక,

[మరల తెరలో]

“కుబేరుండు తొల్లి మదనునితో నింద్రసభలో వైచిన పన్నిదంబున విజయుం డయ్యెఁ గదా! అయుత్సాహంబున నేఁ డీభీమేశ్వరునకు, రాగమంజరీద్వితీయుం డై మహోత్సవంబు సేయించు చున్నవాఁడు. తత్సందర్శనాఁ కుతూహలుం డై దేవేంద్రుండు వియత్పథంబునుండి యవనీతలంబున కిదె విచ్చేయు చున్నవాఁడు. తగుసన్మానంబు గావించుట హెచ్చరించు చున్నారము.

(ఆలకించి) హా! హా! కుబేరుండు గెలుచుటయే? రాగమంజరి యిప్పు డాతనియొద్దనే యున్నదియాఁ అకటా! ఎంతకష్ట మెంతకష్టము. మహోత్సవమా?—మహోత్సవమా? ఇంద్రుండు కూడ విచ్చేసెనా? నిక్కము. నిక్కము. ఇవి దేవతావాక్కులు— అయ్యో! నా కింకేమి గతి? నే నేమొగముతో సురేంద్రుని సందర్శింతును? నే నిమేన ప్రాణము లెట్లు నిలుపఁ గందును! నిలుప నోప—నిలుప నోప. భీమేశ్వరు నొక్కసారి సందర్శించి పిదప నాపోలిన తెరంగునఁ బోవుదును గాక. (అని ముందునకు నడుచు చున్నాఁడు)

[అప్పుడు రాగమంజరీద్వితీయుండగు సిద్ధరూపకు బేరుండును దేవేంద్రాదులును ప్రవేశించుచున్నారు.]

ఇంద్రు—అలకాధిపా! విజయంబు గాంచితివా?

కుబే—త్రిలోకాధినాథునియనుగ్రహమున.

ఇంద్ర—అఖిలలోకనాయకుండగు నీశ్వరునికృపచేత ననుము.

కుబే—అదియును.

ఇంద్రు—మదనుం డెక్కడ?

మనో—ఇదిగో! జీవచ్ఛవమై యీప్రక్క నున్నవాఁడు. (రాగమంజరి వైపు దృష్టి నిగిడ్చి)

ఆ. నమ్మినాను గాని నాగొంతుఁ గోయంగఁ
దలఁచి తనుచు మదిని దలఁప నైతి;
కటికవాని నమ్మి కడకు వానికతానఁ
దెగి యొఱంగుగొఱ్ఱెపగిది నకట!

గీ. అపుడు చేసినబాస యే మాయె చెపుమ!
డబ్బుగలవానిఁ జేకొంటె టక్కులాడి?

కుబే—(కోపముతో)

ఔర? నాపేరుఁ దడవంగ నగునె నీకు
వలయువానిని వెలబోడి వలచు టరిదె?

మనో—(కోపముతో) ఓరీ! నీ కీదురభిమాన మేల? పరులు మూరొక్కని విడిచినపుష్పమున కై యింతగా మురియుచుంటి వేమి?

కుబే—అంగడిలోనిపూవు లెందఱిచే నంటఁబడవు? అట్లని దానిని వలుచుట మాను చుండిరా? నేను మహాస్వచ్ఛందుండ నని చెప్పఁ బనియు నేల?

మనో—అది నేను కాదు. నీవే.

కుబే—ఓహో! అర్థాంతరములను గూడఁ దీయు చుంటివే? అవు నవును. ఇప్పుడు నీగతి యర్థాంతరమే యైనది కదా!

మనో— గీ. మాయలాడియుఁ జంచలమతియు నైన
వెలవెలఁది నోర్తు వశము గావించుకొంటి
ననుచు గర్వంబు నొందంగఁ జనునె నీకు
పిదప నెటులేని నిను బుట్టఁ బెట్టకున్నె.

కుబే—అగు నగును. నీవలె నేను నిరర్థకుఁడ నైనప్పుడు.

మనో—ఏమీ! నన్ను నిరర్థకుఁడ ననియా యధిక్షేపించు చుంటివి?

కుబే—తప్పక నీవు ముమ్మాటికిని నిరర్థకుఁడవే.

మనో—(కోపముతో) ఓరీ! యే మని కారులు ప్రేలు చుంటివి. ఈనాయా యుధమ్మున నీనాలుక రెండు చీలికలు గావించినఁ గాని నోరు మూయవు.

కుబే—(నవ్వుచు) ఆయుధసహాయము లేకుండఁగనే నీకు నాలుకలు రెం డైనవి గదా!

మనో—ఎందుచేత?

కుబే— నీవాడినమాట నెరవేర్చుకొన నేరక వదరు చుండుటచేత.

మనో—విషమ మైనవక్రగతులచేత ననుట మఱచితివే.

కుబే—లేదు. లేదు. అది నీకు నైజగుణ మని యెల్ల రెఱింగినదియే.

మనో—ఛీ! ఛీ! నోటికి వచ్చినట్లువదరెద వేమి? నోరు మూయించెదను సుమా!

కుబే—అంత చేతగానివాఁ డెవఁడు?

ఇంద్రు—కుబేరా! కథాంశంబు ముగిసినది కదా! ఇప్పు డీవృథావాదంబు లేల?

మనో—(రాగమంజరివంకఁ దిరిగి) ఓసీ! మాయలాడీ! నాలిముచ్చువలె దల వంచుకొంటి వేమి? ఎంతమాయలాడివే? మాట తప్పితలుపోకలు పోవ నేర్చిననీ కింకను ముగ్ధత్వ మేల?

రాగ—(తనలో) వచ్చినవాడు చచ్చినను బోడు. కానికూడు దిన్నను కడుపునిండవలయును గదా! అందున నేను గడనకత్తెను. నా కేమి లోపము. ఈతఁ డేమనుకొన్న నేమి? కాని నా కీకయందునను మహాసంతోషము కలుగుచున్నది. ఆహా! నాదెట్టిజన్మ, దేవతాసంపర్కమ యాచితంబుగ లభించెనే. ఈతఁడు కుబేరుఁడా! అందుననే లక్ష్యము లేకుండ నన్నిరీతుల నిజధనంబు వెచ్చింపఁ గలిగినాఁడు. నా కితనిచెట్టఁ బట్టుటకంటెను ధన్యత్వంబు కలదా? ఆతఁడు మన్మథుఁడా; అందుననే. యనన్యసామాన్యంబు లైనరూప తేజంబు లాతనియధీనమం దుండి యున్న వి. ఈతఁడు సురేంద్రుఁడా! ఆహాహా! ఇట్లుమహామహుని త్రిలోకాధినాథుని బ్రత్యక్షముగఁ గన్నులఁ గాంచఁ గల్గుటచేత నేఁడు గదా నాజన్మంబు సార్థక మైనది. మహాపుణ్యంబు లొనర్చి చచ్చినం గాని వీని సందర్శనంబు నేరను జేయజాల రని విందును. నిజముగ నాదియే జన్మ.

ఇంద్రు—కుబేరా! మీమీజయాపజయంబుల నిరూపణమునకై వేచి యున్నారము.

కుబే—అందుల కీరాగమంజరియే తగినది.

ఇంద్రు—ఈశ్వరముఖతః నిరూపింపఁబడవలయును గదా?

కుబే—అ ట్లైన నీశ్వరుని బ్రార్థింతము.

మనో—(తనలో) అకటా! ఎంతటిదుస్థితి మూడినది నావలచినయీరాగ మంజరి నాయెట్టయెదుట సురునితో ముచ్చటలాడుచుండ నే నెట్లు చూడగలను? అయ్యయో! నాకుదీనివలనఁ దుదకు నలుగురిలో నగుబాట్లు గూడఁ బాటిల్లెనే క్రిందు మీఁదును గానక మదోన్మత్తులై మాయావతు లైనయీవేశ్యాజాతికామినులఁ గూడినవారల కందఱికిఁ దుద కిట్టిపాట్లే సంభవించు.

ఉ. ధారుణిలోన వారవనితారతిఁ గోరి వివేక మారి దు
ర్వారతరేచ్ఛ మైఁ దిరుగువారల కెల్లను నిట్టిపాట్లె చే

కూలును గౌరవం బెడలు, గొంటుతనంబును జేరదుఁ గాన నె
వ్వారును నిట్టిదుస్థితి లవంబును గోరక యుండ్రు గావుతన్.

ఇప్పుడు నా కేమి చేయుటకును దోఁచకున్నది. నాప్రతిజ్ఞచొప్పున నాకు వనవాసముతప్పదు శృంగారాంకంబు లుజ్జగించవలయును. హా! కాల మెంతపని సేయించుచున్నది.

సీ. చిలుక తేజీ నెక్కి పొలుపార వినువీథి
వాహ్యాళి యొనరించువార లెవరు?
పూవుటమ్ముల గుప్పి పొలతుల మగలకై
వశ మొనర్చిచెలంగువార లెవరు?
చిగురాకుబాకును జికిలి చేయుచుముగ్ధ
వనితల బెదరించువార లెవరు?
మీనకేతన కాంతిమిఱుమిట్లుగొలుపదు
ర్వారేచ్ఛఁదిరిగెడివార లెవరు?
గీ. యమివరులఘోరతపములు సమయఁ జేయఁ
బాకవైరిపంపునఁ బోవువార లెవరు?
నిఖిలశృంగారములు నాకు నేఁటితోనె
తీరిపోయెనె కాలమాతీరు మారు.

అక్కటక్కటా! నాప్రాణప్రియ యైనరతిని గూడ వీడి పోవలసి వచ్చెనే. అయ్యయో! ఏ నెట్లిజీవంబుల నిల్పువాఁడ? ప్రాణనాయి కిని వీడుట ప్రాణములు విడుచుట కాదా! హా! రతీ! ని న్నెట్లు విడిచి పోవఁ గలను? నిన్నుఁ జూచుట కైన నాకు వీలు చిక్కదు కాల ఋను నేటితో నీఋణము నాకు చెల్లినది. ని న్నొక్కసారి మానస గతంబు జేసి సంస్మరించి మఱి సన్న్యసించువాఁడ. హా! రతీ!

సీ. నీముద్దు నెమ్మోము ప్రేమమై నొకసారి
కడసారి చూపింపఁ గదవె నాకు

నీసుధామధురోక్తి నాసమై నొకసారి
కడసారివినిపింపఁ గదవె నాకు
నీలినూలతకాంతి ప్రీతిమై నొకసారి
కడసారి రూపింపఁ గదవె నాకు
నీకటాక్షనిరీక్ష జోకమై నొకసారి
కడసారి గాన్పింపఁ గదవె నాకు.

గీ. నీదుశృంగారచేష్టల మోద మలరఁ
జూపు మొకసారి కడసారి సుదతినాకు
ప్రాణధన మైననిన్ను నాయఖిలసాధ
నముల నేఁటితో వీడుచున్నాను గాన.

హా రతీ! సద్గుణవతీ! నీమాటలు వినని కారణమ్మున గదా నా కిట్టి దుర్వ్యవస్థ తటస్థించినది. ఇట్టియనాదరణుని నింక మఱచి పొమ్ము.— ఏ నొక్కసారి యఘునాశనకరుండును భక్తవత్సలుండును, నగునీభీమేశ్వరుని బ్రార్థించి తరువాత నాపోలిన తెఱంగుఁ జూచు కొందును గాక (అని భీమేశ్వరున కభిముఖుం డగు చున్నాఁడు.)

ఇంద్రు—కుబేరా! మన కీశ్వరసాక్షాత్కారం బవశ్యకర్తవ్యంబు. కావున నామహాత్ముని బ్రార్థింతము.

కుబే—అదిగో! మదనుం డాదేవదేవున కభిముఖుం డై యేమియో ప్రార్థించు చున్నాఁడు. ఆలకింతము.

మనో—(చేతులు జోడించి)

సీ. ఎవ్వాఁడు జగముల కెల్లను దల్లియుఁ
దండ్రియుఁ దాన యై తనరువాఁడు;
ఎవ్వాఁడు ప్రియముగా మువ్వన్నెపులితోలు
కట్టుపుట్టంబుగాఁ గలుగువాఁడు;

ఎవ్వాఁడు జగ మెల్ల నేర్చువిషాగ్నిని
గబళించి సురనుతుల్ గన్నవాఁడు,
ఎవ్వాఁడు భక్తునియింటఁ గావలి కాచి
భక్తవశ్యుం డనఁ బరఁగువాఁడు.

గీ. ఎవఁడు కాలునిగర్వంబు నెల్ల నణఁచి
మునికుమారుని బ్రోచినఘనతవాఁడు,
అట్టిలోకేశుఁ బరమేశు నాశ్రయించి
భక్తి నుతియింతు నతిదుఃఖభవ మడంతు.

దండకము. శ్రీమన్మహా కాళికాహృత్సరోజాతసంచార! చారుప్రభారాజితాంగా! సురేంద్రాది బృందారకానీకసంస్తుత్యమానాంఘ్రిపంకేజ! శ్రీదక్షవాటీవిహారా! దయాసాంద్ర! దాక్షిణ్యభావా! పరంధామ! భీమేశ! నీదివ్యపాదారవిందమ్ములన్ భక్తవర్గంబు లెల్లప్పుడున్ మానసంబందుఁ గొల్వన్ దదీయైకనిష్ఠాగరిష్ఠత్వబుద్ధిన్ విమర్శించి వారిన్ బ్రమోదాంతరంగంబుతో నెప్పుడున్ బ్రోది గావించుచున్ నీకటాక్షేక్షణంబున్ తిరంబై పొసంగన్ సదా గ్రాలుచుందే కదా! నీమహత్వంబు వర్ణింపఁగా నేర్తు రెవ్వారు? నీ వాదిమధ్యాంతశూన్యుండ వాద్యుండ వీలోకజాలంబులన్ లీలఁ బుట్టింప రక్షింపఁగిట్టింప నీవే త్రయీరూపముల్ తాల్చి చెన్నారుచున్నాఁడవే కాదె, నీయిట్టిలీలావిహారంబు లెవ్వారు వర్ణింపఁగా నేర్తు రో దీనసంరక్షకా! చాల దీనుండనై వంచనోద్వృత్తిసంతప్తచిత్తుండ నై యున్ననీదాసునిన్ నన్నుఁ గాపాడు మో దేవ! దివ్యప్రభావా! నమస్తే నమస్తే నమః.

[అప్పుడు భీమేశ్వరుఁడు ప్రత్యక్ష మగుచున్నాఁడు.]

కుచే—(చేతులు మొగిడ్చి)

గీ. లోకములు బ్రోచుతండ్రివి లోకకర్త
వాద్యుఁడవు వేదవేద్యుఁడ వఖిలశుభము
లిచ్చుదేవుఁడ వగునీకు నెఱఁగుచుంటి
పూర్ణతరభక్తి సాష్టాంగపూర్వకముగ.

(అనినమస్కరించు చున్నాఁడు.)

ఇంద్రు— క. తెలిమల్లెపూవుటెత్తుల
పొలుపున నేదేవునికకు భూషణ మగుచుఁ
దెలివాఁక యొప్పు నాయు
జ్జ్వలమూర్తిని నిన్నుఁ గొలుతు సదమలభక్తిన్.

(నమస్కరించు చున్నాఁడు.)

భీమే—కుమారా! మారా! నీకు కుశలమా! మిత్రమా! కుబేరా! క్షేమమే కదా! త్రిలోకాధినాయకా! సురేంద్రా! వింత లేవియు లేవుగద!

ఇంద్రు—దేవాదిదేవా! దివ్యప్రభావుల రగుమీకు మేమా విన్నవించువారము.

కుబే—అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడ వగునీకు దెలియనిది గలదా?

భీమే—(చిఱునవ్వుతో) మదనకుబేరు లిరువురిలోను గల్పోటములు నిరూపింపవలయును గదా!

ఇంద్ర—చిత్తము.

మనో—(తనలో) నాసంగతి యిదివఱకే తెలిసినది.

భీమే—మదనా! నీ వట్లు చిన్నబోయి యుంటి వేమి?

మనో—దేవా! అందుల కీరాగమంజరియే కారణము.

భీమే—మొదట నీకే వశవర్తిని యయ్యెఁ గదా!

మనో—చిత్తము.

భీమే—నీ కిఁక విచార మేల?

మనో—(రాగమంజరి వైపుచూచు చున్నాఁడు.)